జూలై 1986

ప్రచురణ :

నవభారతి ప్రచురణలు
3-4-705/4, నారాయణగూడ
హైదరాబాదు - 500 029

ముద్రణ :

పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడా
హైదరాబాదు - 500 004

ప్రతులకు :

సాహిత్యనికేతన్
ఏలూరు రోడ్డు
విజయవాడ - 2

సాహిత్యనికేతన్
3-4-852, బరకత్‌పురా
హైదరాబాదు - 500 027

వెల : 5-00

# స్వార్థ రాజకీయాల ఊబిలో

# పంజాబ్

రచన :

కె. యస్. మూర్తి

హరిహర శర్మ



నవభారతి ప్రచురణలు

హైదరాబాదు – 500 029

## ఈ పుస్తకంలో...

పంజాబ్ సమస్యకు అంతం లేదా అని తరచుగా చాలా మంది అడుగుతున్నారు. అకాలీదళ్‌తో రాజీవ్ చేసుకున్న ఒప్పందం సమస్యను పరిష్కరిస్తుందని భావించి మోసపోయామనే బాధతో అలా అడుగుతున్నారు. వాస్తవానికి పంజాబ్‌లోని తీవ్రవాదుల సంఖ్య తక్కువే. దృఢమైన సంకల్పంతో ప్రభుత్వం వ్యవహరించనందున ఈ యిబ్బందులు వస్తున్నాయి. ప్రజాచైతన్యమే ఈ సమస్యను పరిష్కరించాలని సూచిస్తున్న ఈ పుస్తకంలో పంజాబ్ సమస్య పూర్వాపరాలు వివరించబడ్డాయి.

—ప్రచురణకర్తలు



పంజాబ్ సమస్య యొక్క పూర్వాపరాలు పూర్తిగా తెలియక పోయినా, నేడు మనదేశాన్ని పట్టి పీడిస్తున్న విషమ సమస్యగా అందరికీ తెలుసు. అయితే విదేశీ ఏజెంట్లు పంజాబ్ ప్రాంతంలో ఎందువలన అల్లకల్లోలాన్ని సృష్టిస్తున్నారు? స్వార్థ రాజకీయాల ఊబిలో చిక్కుకున్న నాయకులు దేశ సమగ్రతను, భద్రతను విస్మరించటానికి ముఖ్య కారణ మేమిటి? శ్రీమతి గాంధి హత్యకు కారకులెవరు? దేశం తిరిగి విభజింపబడే ప్రమాదముందా? యిలా అనేక ప్రశ్నలు భారతీయుల్ని వేధిస్తున్నాయి. ఈ ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకోటానికి పంజాబ్ సమస్యకు పరిష్కారం లేదా? అన్న సందేహాన్ని తీర్చుకోటానికి ఈ సమస్యను గురించి అన్ని విషయాలను మనం తెలుసుకోవాలి.

ఉపక్రమణిక :

ఈనాడు ఈ సమస్య ఉధృత రూపాన్ని దాల్చినా దీని విష బీజాలను ఆంగ్లేయులే నాటివెళ్లారు. వారు యోజనా బద్ధంగా కుట్రను పన్ని దేశంలో విచ్ఛిన్నకర శక్తులకు ప్రోత్సాహకరమైన ఆలోచనలను ప్రవేశ పెట్టి పోయారు. వారి రాకకు పూర్వం పంజాబ్ ప్రాంతం మన దేశ చరిత్రలోని సాంస్కృతిక రాజకీయ ఘట్టాలకు ముఖ్య కేంద్రం. ప్రాచీన సింధూ నాగరికతను చిహ్నంగా బయల్పడ్డ హరప్పా నగరం పంజాబ్ ప్రాంతంలోనిదే. వేద ప్రవచనం మొదట పంజాబ్ ప్రాంతంలోనే జరుగు తుండేదని కొందరు పండితుల అభిప్రాయం. భారతదేశంపై అలెగ్జాండర్ దండయాత్ర చేసినప్పుడు అతను ఓటమిని చవిచూసినది పంచ నదీ

ప్రాంతంలోనే. *పంచ ఆప (నదుల) ప్రాంతం దేశంలోని మిగిలిన ప్రాంతాలతో అవినా భాజ్యమైన సంబంధాన్ని పెంచుకుంది.

చారిత్రక కాలంలో కూడ దేశ సాంస్కృతిక విలువల పరిరక్షణకై పంజాబ్ కృషి చేస్తూనే వచ్చింది. మొగల్ రాజులు దేశాన్ని పాలిస్తున్న కాలంలో హిందూ ధర్మ వ్యతిరేకతను ప్రోత్సహిస్తూ తమ అధికారాన్ని ముస్లిమ్ మత ప్రచారానికి ఉపయోగిస్తుంటే, వారి దమనకాండను ధైర్యంగా ఎదిరించిన వారిలో సిక్కు గురువులు ప్రముఖులు.

సిక్కు సంప్రదాయాన్ని ప్రారంభించిన గురునానక్ ధార్మిక సాంస్కృతిక చైతన్యాన్ని ఆశించి హిందూ సమాజ పరిధిలోనే కృషి చేశారు. వారి అయిదవ గురువు అర్జున్‌సింగ్ హిందూ ధర్మ రక్షణకై కృషి చేసి జహంగీర్ చేత హత్య గావింపబడ్డాడు. గురు హర్‌గోవింద్ కూడ అందుకే కారాగారావాసాన్ని అనుభవించాడు. తొమ్మిదవ గురువు అయిన గురు తేజ్ బహదూర్ ఔరంగజేబ్ చేత హత్య గావింపబడ్డాడు. భక్తి ప్రధానమైన సిక్కు (శిష్య) సంప్రదాయం, క్షాత్ర తేజాన్ని సంతరించుకుంది. హిందూ ధర్మానుయాయులు అనుసరించే అనేక ఆరాధనా పద్ధతులలో సిఖ్ (సిక్కు) లది ఒకటి. వారి గురువులు తమను హిందువులుగానే పరిగణించుకున్నారు. హిందూ ఇతిహాసాలను, పురాణాలను తమవిగానే భావించారు. అంతేకాదు శ్రీరాముని, శ్రీకృష్ణుని, చండీ మాతను, దుర్గను స్తుతించారు. ఆ కాలంలో సమాజంలో చోటు చేసుకున్న సామాజిక

---

* జీలం, చీనాబ్, రావి, బియాస్, సట్లైజ్ అనే అయిదు నదులు సింధు నదికి ఉపనదులు, అవి ప్రవహించే ప్రాంతం కాబట్టి పంజాబ్ అయింది. ఈ నదులను పూర్వం వరుసగా వితస్తా, చంద్రభాగ, ఇరావతి, విపాశ, శతద్రు నదులని పిలిచెడివారు.

దురాచారాలకు వ్యతిరేకంగా నానక్ తన శిష్యులను సమీకరించి, సమాజాన్ని సంస్కరించదలచుకున్నారు. సంత్ కబీర్ ఆలోచనలు గురునానక్ ఆలోచనలు ఒకే విధంగా ఉంటాయి. కులం పేరుతో సమాజం చీలిపోవటం ఆయనకు యిష్టంలేదు. గురునానక్ ద్వేషిస్తూ వచ్చిన స్వార్థ భావనే మహ్మదీయుల దండయాత్రలకు అవకాశమిచ్చింది. గురునానక్ 1469లో జన్మించి 1500 ప్రాంతంలో తన బోధనలను ప్రారంభిస్తే 1526 ప్రాంతంలో బాబర్ మొగల్ సామ్రాజ్యాన్ని స్థాపించాడు. అంటే గురు నానక్‌ను బాధపెట్టిన సామాజిక పరిస్థితుల-దుష్ప్రభావాన్ని మనం అర్థం చేసుకొనవచ్చు. మన దేశంలో 13, 14, 15, 16, 17, 18 శతాబ్దాలలో జన్మించిన సంత్‌లు, సాధువులు ఆధ్యాత్మిక బోధనలతోపాటు సంఘ సంస్కరణ గురించి కూడ ఆలోచిస్తూ వచ్చారు. వారి ఆలోచనల వెనుక ఉన్న ఆవేదనను అర్థం చేసుకోలేక వారు హిందూ ధర్మాన్నే దుయ్యబట్టుతున్నారనీ, హిందూ ధర్మ వ్యతిరేకులనీ చెప్పటం దుస్సాహసం. అసలు విషయాన్ని అర్థం చేసుకోలేని కొందరు సిక్కు సంప్రదాయాన్ని అలాగే చిత్రించారు. కాని వాస్తవం తద్భిన్నంగా ఉంది. గురు గ్రంథ సాహెబ్‌లో గురుతేజ్ బహదూర్‌చే రచింపబడిన ఒక పద్య సారాంశమిలా ఉంది. "భగవంతుని నామం బ్రహ్మానంద ప్రదాయిని, ఆ నామ జపమే అజామిళుని రక్షించింది; గణికకు మోక్షాన్ని అందించింది, దుర్యోధనుని ఆస్థానంలో ద్రౌపది మాన సంరక్షణం చేసింది కూడ అదే." (1008)

1698లో ఆనందపూర్ సాహెబ్‌వద్ద గురుగోవింద సింగ్ ఆధ్వర్యంలో యజ్ఞం చేయబడింది. పంథ్ ప్రకాశ్‌లో ఈ యజ్ఞ నిర్వహణగురించి గురుగోవిందసింగ్ చెప్పినట్లుగా యిలా వ్రాయబడింది. "మహర్షులు, అవతార పురుషులు అనుసరించిన ధర్మమే మనది. విశ్వమానవాళి శ్రేయస్సు కోసమే మన మీ ధర్మాన్ని అనుసరిస్తున్నాం....యజ్ఞం, హవనం మానవ

జాతి కెంతో మేలు చేస్తాయి. అయితే తురుష్కులు వాటి నిర్వహణకు అనుమతి నివ్వటం లేదు. అన్ని వర్ణాల ప్రజలు నేడు గొర్రెలవలె భీరువులయ్యారు. అందువలననే తురుష్కుల నెదిరించలేక పోతున్నారు. యజ్ఞ ధూమం వాసన చూసినవాళ్ళు ధైర్యసాహసాలను ప్రదర్శించ గలరు. సింహ కిశోరాల వలె తయారవుతారు."

ఆరవగురువయిన*గురుహర్ గోవింద్ తన అనుయాయులనే కాదు, శరణార్థులను. అధర్మానికి గురయిన వారి నందరినీ రక్షించటానికి ఆయుధాలను చేపట్టాడు. అయితే అకాల్‌తక్త్ నుండి ఆయన యుద్ధం చేయలేదు. లోహగఢ్ వద్ద కోటను నిర్మించుకుని, ఆ కోట కేంద్రంగా యుద్ధాలు చేసాడు. తన కుటుంబాన్ని ఛేహర్తా సాహెబ్‌వద్ద ఉంచాడు. ఆయన కానీ గురుగోవింద సింగ్‌కాని మతపరమైన రాజ్యాన్ని స్థాపించాలని కోరుకో లేదు. యావత్‌భారతాన్ని తన మాతృభూమి అని వర్ణిస్తూ పాట్నాలో, నాందేడ్‌లో ఆధ్యాత్మిక కేంద్రాలయిన తఖత్‌లను ప్రారంభించాడు.

కర్మసిద్ధాంతంలో, పునర్జన్మ సిద్ధాంతంలో,మోక్ష సాధనలో, భక్తి, జ్ఞాన, కర్మయోగాలలో హిందూ ధర్మాన్నే అనుసరిస్తారు, సిక్కుసంప్రదాయాన్ని అనుసరించేవారు కూడ. అహారం అడపిల్లలను యిచ్చిపుచ్చుకోవటంలో సిక్కులకు యితర హిందువులకు ఎట్టి అభ్యంతరాలు లేవు. భాయిగురుదాస్ కీర్తనలలో శ్రీకృష్ణుని లీలలు, భాగవతోత్తముల కథలు మనకు వినిపిస్తాయి.ఓంకారం, రామనామం గురుగ్రంథసాహెబ్‌లో తరచుగా

---

* గురుహర్ గోవింద్‌కు 'బందీఛోడ్ బాబా' అనే బిరుదుకూడ ఉంది, మొగలులు బందీ చేసిన హిందువులను విడిపించటంతో ఆ బిరుదు వచ్చింది.

కనపడ్తాయి. గురు అర్జున్‌దేవ్ విరచితమైన సహస్ర నామావళిలో మరళీ మనోహర, కేశవ, సారంగధర, హరి, మోహనకృష్ణ, మురారి వంటి నామాలే ఉన్నాయి. పంజాబ్‌ను పాలించిన వారిలో చెప్పుకో దగ్గ వ్యక్తి మహా రాజా రంజిత్‌సింగ్. సర్వధర్మ సమభావాన్ని ఆచరణలో పెట్టి చూపించిన వ్యక్తి. సిక్కులు ధరించే ఖడ్గాన్ని 'కీర్షణ్' (కృపాణం) అంటారు. కృపకు ఆధారమది అంతేకాని హింసకు కాదు.* గురుగోవిందసింగ్ ధర్మరక్షణకై బద్ధకంకణులు కండని చెప్పాడేకాని యితర ధర్మాలవారిని హింసించమని చెప్పలేదు.

**ఖల్సా అంటే :**

1699లో వైశాఖినాడు ఆనందపూర్ సాహెబ్‌వద్ద నిర్వహించబడిన ఒక సమావేశంలో ఖాల్సాపంథ్ ఏర్పడింది. ధర్మరక్షణకోసం తమ జీవితాలనే అర్పించగల ధైర్యవంతులను ముందుకు రమ్మని కోరినప్పుడు దయారామ్, ధర్మదాస్, మొహాకమ్‌చాంద్, హిమ్మత్‌రామ్, సాహెబ్‌చాంద్ ముందుకు వచ్చారు. వారిధైర్యానికి మెచ్చుకుని వారు తనకు ప్రియమైన అయిదుగురు

---

* సిక్కు సంప్రదాయానికి చెందిన పదిమంది గురువులు గురునానక్ (1469-1539) గురు అంగద్ (1504-52) 1539-52; గురు అమర్‌దాస్(1479-1574) 1552-74; గురురామ్‌దాస్ (1534-1581); 1574-81గురుఅర్జున్‌దేవ్(1563-1606) 1581-1606; గురుహర్‌గోవింద్ (1595-1644) 1606-44; గురు హర్‌రాయి (1630-1661) 1644-61; గురు హర్‌కిషన్ (1656-1664), 1661-64; గురు తేజ్‌బహదూర్ (1621-1675) 1664-75; గురు గోవింద్‌సింగ్ (1666-1708) 1675-1708 బ్రాకెట్లలో పూర్తి జీవితకాలం విడిగా వారు గురువుగా వ్యవహరించిన కాలం యివ్వబడింది.

అని గురుగోవిందసింగ్ వర్ణించారు. అందుకునే పంచ్ ప్యారాలయ్యారు. వారు పవిత్రభావంతో ముందుకు వచ్చారు. అందువలన (పవిత్రులు) ఖల్సాలు అయ్యారు. ఆ నాటినుండి సింహసదృశ శక్తిని సంపాదించి ప్రదర్శించమని అందుకు చిహ్నంగా సింగ్ నామాన్ని ధరించమన్నారు. ఖల్సా అంటే ఆలోచనలలో, మాటలలో, చేతలలో పవిత్రత కలవారు. సిక్కులు ఆ నాటి నుండి కచ్ (లంగోటి), కర (ఇనుపకడియం), కిర్పణ్ (కత్తి), కాంగి (దువ్వెన), కేశములను ధరించటం ప్రారంభించారు. వీటినే పంచ కకారాలు అన్నారు. ఖల్సా సంప్రదాయం ఒక ప్రత్యేకమైన మతంకాదు. ధర్మరక్షణకై ఏర్పరచుకున్న నియమం.

## స్వర్ణ దేవాలయం :

సిక్కులకు పరమ పవిత్రమైన యాత్రాస్థలము అమృతసర్. అచ్చటి స్వర్ణ దేవాలయం ప్రపంచ ప్రఖ్యాతి చెందింది, హిందువులంతా స్వర్ణ దేవాలయాన్ని పవిత్రంగానే భావిస్తారు. 71 25 ఎకరాల విస్తీర్ణంగల స్వర్ణ దేవాలయం కొన్ని మందిరాల సముదాయం. ప్రాంగణం లోపల పెద్ద సరోవరంలో స్నానం చేసి మందిరాలను సందర్శించటం యాత్రీకుల అలవాటు సముదాయంలోని ప్రధానమైన మందిరాలు గురుద్వారా బాబా అతల్, గురుద్వారా దీప్‌సింగ్, అకాల్ తఖత్, హర్ మందిర్ సాహెబ్. గురు హర్ గోవింద్ అకాల్ తక్త్‌ను నిర్మించటానికి కారకులు. క్రీ.శ. 1606-1609లో ఆ మందిరాన్ని నిర్మించారు. బాబా బుద్ధదేవ్, భాయీ గురుదాస్ స్వయంగా నిర్మాణ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ దేవాలయ సముదాయంలో ప్రధాన మందిరం హర్ మందిర్ సాహెబ్. అకాల్ తక్త్ సామాజిక కేంద్రమయితే. హర్‌మందిర్ సాహెబ్, ఆధ్యాత్మిక, ధార్మిక కేంద్రం. ఇది విధర్మీయుల దాడికి రెండుమూడు సార్లు గురయింది. 1757 లో అహ్మద్ షా అబ్దాలీ దాడి చేసాడు. 1762 లో రెండుసార్లు దాడి జరిగింది. 1765 లో

పునర్నిర్మించారు. మహారాజా రంజిత్ సింగ్ హర్ మందిర్‌కు బంగారు పూతను పూయించారు ఆనాటి నుండి ఇది స్వర్ణదేవాలయంగా ప్రసిద్ధి కెక్కింది.

గురుతేజ్ బహదూర్ స్వర్ణ దేవాలయ సముదాయానికి వచ్చినా హర్ మందిర్‌లో ప్రవేశించనే లేదు. గురుగోవింద్ సింగ్ అమృత సర్‌కే రాలేదు. ఆయన ఆనందపూర్ సాహెబ్ వద్దనే ఉండేవారు.

గురు అర్జున్ దేవ్ ఆది గ్రంథ సంకలనానికి తోడ్పడటమేకాక పవిత్రంగా చూడమని ఆదేశించారు. గురు గోవింద్ సింగ్ పదిమంది గురువులు తరువాత ఆది గ్రంథమే గురువనీ, దానిని గురు గ్రంథ సాహెబ్ అని గౌరవంగా పిలవాలనీ సూచించారు. గురుముఖి లిపిలో ఉంటుందీ గ్రంథం.

క్రీ.శ. 1708-1716 ప్రాంతంలో సిక్కులకు బందా బైరాగీ నాయకత్వాన్ని వహించాడు. చివరికి ముస్లిమ్ సైన్యం చేతిలో ఓడిపోయి హతమార్చ బడ్డాడు. ఆ తరువాత మహారాజా రంజిత్ సింగ్ కాలంలో (1780-1839) సిక్కులు వైభవస్థితిలో ఉన్నారు. ఆయన సిక్కులలోని వివిధ వర్గాలవారిని సంఘటిత పరచి బలమైన రాజ్యాన్ని స్థాపించాడు. బ్రిటిష్ వారిని హడలగొట్టాడు ఆయన మరణించిన తరువాత సరియైన నాయకత్వం లేకపోవటంతో ఆయన రాజ్యం ఆంగ్లేయుల వశమైంది.

ప్రత్యేకత అనే విష బీజం

1857 లో భారత ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం జరిగింది. భారతీయులు తమను ఎక్కువకాలం పరిపాలించ నివ్వరని ఆంగ్లేయులు గ్రహించారు. తమ సామ్రాజ్యాన్ని నిలుపుకోవాలంటే భారతీయులను భిన్న

వర్గాలుగా విభజించి అనైక్యతను పెంచాలి అని ఆంగ్లేయులు గ్రహించారు. అనైక్యతను పెంచటానికి రకరకాల మార్గాలను వారు అనుసరించారు

"ఈ దేశంలో భిన్న జాతులు పరిపాలించారు. ఎవరిదీ మొదట్లో ఈ దేశం కాదు. ఆర్యులు కూడా ఈ దేశానికి విదేశాలనుండి వలస వచ్చిన వారే" అన్న సిద్ధాంతాన్ని లేవదీసి ప్రజలలో తమ దేశంపట్ల ఉన్నభక్తిని, తమ పూర్వీకుల పట్ల ఉన్న గౌరవాన్ని దెబ్బతీయటానికి ప్రయత్నించారు. అలాగే ఈ దేశంలో ఉన్నవారు ఒక మతానికి చెందినవారు కారు. బౌద్ధులు, జైనులు, సిక్కులు హిందువులు కారు. వారి ఆచార వ్యవహారాలు వేరు అంటూ మరొక వాదాన్ని ప్రచారంలోకి తీసుకువచ్చారు. వారి వాదాన్ని స్వార్థపరులైన కొందరి ద్వారా అందరి ముందూ ఉంచారు.

మహారాజా రంజిత్ సింగ్ సైన్యంలో పనిచేసిన రామ్‌సింగ్ కూకా రాజకీయ నాయకులలో ప్రబలిన అవినీతి కారణంగా దేశం ఎలా కష్టాల పాలయిందీ గ్రహించి, స్వరాజ్యమూ, స్వదేశీ, గోసంరక్షణా అనే ప్రధానాంశాలను సాధించటానికై ఒక ఉద్యమాన్ని ప్రారంభించాడు. దానినే కూకా ఉద్యమం అన్నారు. ఆ ఉద్యమం ద్వారా ప్రజలలో ఆత్మ విశ్వాసం పెరుగుతోందని భావించి దానిని అణచివేయటానికై ఆంగ్లేయులు తీవ్రంగా ప్రయత్నించారు. స్వార్థపరులైన సిక్కులను చేరదీసి వారిచేత ఉద్యమాన్ని వ్యతిరేకింప చేసారు. 1872 లో అటువంటి వారే ఉద్యమానికి వ్యతిరేకంగా ఒక వినతిపత్రాన్ని ఆంగ్ల ప్రభుత్వానికి సమర్పించారు. 1873 లో తమ విధేయులచే 'సింగ్ సభ'ను ప్రారంభింపచేసారు. 1868 లో ఆ తరువాత 1881 లో సేకరించబడిన జనాభా లెక్కలలో సిక్కులను వేరుగా నమోదు చేయించారు.

అంతకు పూర్వమే ఈ రెండు సంప్రదాయాల మధ్య అనైక్యతను పెంచటానికై పరిశోధనలు, రచనలు పేరిట కొంత కృషి జరిగింది. ఆ కృషిలో భాగంగానే 869 లో ఎర్నెస్ట్ ట్రంప్ అనే జర్మన్ రచయిత చేసిన ఆదిగ్రంథ ఆంగ్ల అనువాదాన్ని ప్రచురించారు. బ్రిటిష్ ఇండియా కార్యాలయం అందుకు ధన సహాయం చేసింది. సిక్కులదొక ప్రత్యేక మతమని పండితులచే చెప్పించటమే ఆంగ్లప్రభుత్వ లక్ష్యం. అయితే ట్రంప్ అందుకు భిన్నంగా "గురునానక్ హిందువే. బ్రాహ్మణుల బోధనలను వేదాల పురాణాల ఆధిపత్యాన్ని అంగీకరించినవాడే" అని వ్రాశాడు. అందుకనే ఆ తరువాత యమ్.ఏ. మకలిఫ్ వ్రాసిన సిక్కుమతం అనే గ్రంథంలో ట్రంప్‌పై పెద్దఎత్తున దాడి జరిగింది.

## ఇరవయ్యో శతాబ్దం-మొలకెత్తిన బీజం

1901 జనాభా లెక్కలలో సిక్కు శబ్దంయొక్క అర్థాన్ని కేవలం కేశధారులకే పరిమితంచేసి, ఉద్యోగాలలో ముఖ్యంగా సైన్యంలో వారికి ప్రాముఖ్యం ఇవ్వడం ప్రారంభమైంది. 1878 లో సింగ్‌సభ ప్రారంభంతోనే మతాన్ని రాజకీయాలకోసం ఉపయోగించటం ప్రారంభమైంది. అదికూడ ఆంగ్లేయుల అండదండలతోనే. 1902 లో చీఫ్ ఖాల్సా దీవాన్ స్థాపన జరిగింది. అదికూడ బ్రిటిష్ కుట్రలో భాగమే. దానికి అధ్యక్షుడుగా బ్రిటిష్ వారికి విధేయుడైన వారినే నియమించడం అందుకు ఉదాహరణ. బ్రిటిష్‌వారి విధేయత కారణంగానే స్వర్ణదేవాలయం మేనేజర్ సర్దార్ అరూర్‌సింగ్ జలియన్ వాలాబాగ్ దురంతానికి కారకుడైన జనరల్ డయ్యర్‌ను స్వర్ణదేవాలయానికి ఆహ్వానించి సన్మానించాడు. బ్రిటిష్ సైన్యంలో చేరమని ప్రచారం చేసాడు. 1909 లో సిక్కులకు ప్రత్యేకంగా వివాహ చట్టాన్ని ఆంగ్లప్రభుత్వం రూపొందించింది.

విద్యారంగం ద్వారా కూడ వేర్పాటు మనస్తత్వాన్ని పెంచాలని ఆంగ్లేయులు ప్రయత్నించారు. అందుకోసమే ప్రత్యేక పాఠశాలలను కళాశాలలను ప్రారంభించారు. అయినా మరొకప్రక్క సిక్కులలోని మేధావులు, దేశభక్తిపరులు సిక్కులను ఈ జాతీయ జీవనస్రవంతిలో కలిపి ఉంచేందుకు ప్రయత్నిస్తూనే వచ్చారు 1900 లో రావల్పిండిలో జరిగిన హిందూ సమ్మేళనంలో అధ్యక్షోపన్యాసంలో బాబా గురు బక్షసింగ్ బేడీ, సిక్కులు హిందూ సమాజంలో విడదీయరాని అంతర్భాగమన్నారు 1905 వరకు స్వర్ణదేవాలయ పూజారులుగా మిగిలిన హిందూ దేవాలయాలలోవలె బ్రాహ్మణులే ఉండేవారు. భగత్‌సింగ్ వంటి గొప్ప దేశభక్తులు స్వాతంత్ర్య సముపార్జనకై తమ జీవితాలనే త్యాగం చేసారు గురుబాణిలో దేశసమగ్రత గురించి, భద్రత గురించి ఉన్న స్ఫూర్తివంతమైన కీర్తనలనుండి ప్రోత్సాహాన్ని పొందారు.

'రాహత్ ప్యారిమోకో, సిఖ్ ప్యారా నహీఁ'

[పవిత్ర జీవనమార్గం నాకు ప్రీతిపాత్రమైనది కాని సిక్కునని పిలిపించుకోవటం కాదు]

అని గురుగోవింద్ సింగ్ చెప్పిన వాక్యాలను వారు మరచిపోలేదు. అయితే మన దురదృష్టంకొద్దీ ఆ వాక్యాలనే, నేడు మన సిక్కు సోదరులు మరచిపోతున్నారు.

## స్వాతంత్ర్యానికి పూర్వం

ప్రత్యేక సిక్కువాదం ప్రధానంగా జాట్ సిక్కులు ప్రారంభించింది. వారు గ్రామీణ ప్రాంతంలో నివసిస్తూ వ్యవసాయమే జీవనవృత్తిగా కలవారు. 1942 క్రిప్స్‌మిషన్ భారతదేశానికి వచ్చినప్పుడు ప్రత్యేక సిక్కువాదానికి ప్రాణం పోయటానికి ప్రయత్నం జరిగింది. అయితే చాలామంది

సిక్కులు ఆ ప్రయత్నాన్ని ఎదిరించారు. 1943 లో మాస్టర్ తారాసింగ్ 'ఆజాద్ పంజాబ్' ప్రత్యేకంగా కావాలంటూ తన కోరికను వెలిబుచ్చాడు. అయితే పంజాబ్ భారతదేశంలో ఒక రాష్ట్రంగా ఉండాలనే వారి కోరిక. 1944లో బాబాఖరక్‌సింగ్ సమైక్యభావాన్ని పెంచటానికి ప్రయత్నించాడు. అదేసంవత్సరం అమృతసర్‌లో జరిగిన ఒక సమావేశంలో స్వతంత్ర ప్రతిపత్తిగల ప్రత్యేక రాష్ట్రం అనవసరమంటూ తీర్మానాన్ని ఆమోదించారు. సర్దార్ ఉజ్వల్‌సింగ్, జ్ఞాని కర్తార్‌సింగ్ ఆ సమావేశంలో మాట్లాడుతూ పాకిస్తాన్ ఏర్పాటును చెడగొట్టటం కోసం మాత్రమే 'ఆజాద్ పంజాబ్'ను కోరటం జరిగిందన్నారు.

**దేశవిభజన తరువాత—**

1947 ఆగస్టు 15 న దేశానికి స్వాతంత్ర్యం లభించినా, దేశ విభజన కారణంగా పలువురి మనస్సులు దుఃఖభూయిష్ఠ మయ్యాయి. ఆ సమయంలో మతం పేరిట జరిగిన దారుణమారణకాండ చరిత్రలో మరపురానిది. హిందువులు విపరీత ప్రాణ, ఆస్తి నష్టానికి గురయ్యారు. అప్పుడు సిక్కుల ప్రత్యేకవాదం చల్లబడిపోయింది. మాస్టర్ తారాసింగ్ పండిట్ నెహ్రూను కలిసి తాము వేర్పాటువాదాన్ని విడనాడుతున్నట్లు చెప్పటం జరిగింది. అయినా ప్రత్యేక భావన తగ్గిపోలేదు.

ఈ భావన యిలా ఉంటే అగ్నికి ఆజ్యంపోసినట్లు 1951-61 జనాభా లెక్కల సేకరణ సమయంలో ఆర్యసమాజ్ నాయకత్వం పంజాబ్ ప్రాంతంలో నివసిస్తున్న సహజధారులైన హిందువులను హిందీని తమ మాతృభాషగా నమోదు చేయించుకొమ్మంది. వాస్తవానికి వీరంతా పంజాబీనే మాట్లాడేవారు. అయితే పంజాబీ భాషను హిందువులు మాట్లాడకూడదు అన్నట్లుగా ఈ నిర్ణయం తీసుకొనటం వలన కూడ సమస్య మరొక విధంగా

తీవ్రమయింది. ఇదే సమయంలో ఆనాటి ఆర్. యస్. యస్. అధినేత శ్రీ యమ్.యస్. గోళ్వాల్కార్ ఈ విషయంపై వ్యాఖ్యానిస్తూ "భారత దేశానికి చెందిన భాషలన్నీ జాతీయ భాషలే. మనం అన్ని భాషలను గౌరవించాలి మనం మన యిళ్ళల్లో మాట్లాడే పంజాబీ భాషను మాతృభాషగా చెప్పుకోవటంలో తప్పేమీలేదు" అన్నారు.అయితే ఆయన సలహా చాలామందికి నచ్చలేదు. అందువలన పెడచెవిన పెట్టారు. అలా పెడచెవినపెట్టిన వారిలో రాజకీయ పక్షాలవారు కూడా ఉన్నారు.వారి దృష్టిలో ఓటు బ్యాంకులున్నాయి. అవి తయారు చేసుకోటానికి భాషను ఉపయోగించుకోవచ్చని గ్రహించటం ప్రమాదకరమయింది. ఈ అనాలోచిత చర్య కారణంగా సిక్కుల మనస్సులలో ఏర్పడిన వేర్పాటు ధోరణి, ప్రత్యేక భావన బలపడ్డాయి. "పంజాబీ భాష సిక్కులదీ, హిందీ భాష యితర హిందువులదీ కాబట్టి హిందువులు సిక్కులు వేర్వేరు వర్గాలు" అనే ఆలోచన పెరిగింది. సహజధారులకు కేశధారులకు మధ్య అంతరం పెరిగింది.

19 వ శతాబ్దంలోనే అంటే 1886 లో సత్యార్థ ప్రకాశ్ ప్రచురింపబడింది. సిక్కుల మనస్సులలో ఆ గ్రంథంలోని కొన్ని వాక్యాలు తాము హిందువులం కామనే భావనను పెంచాయి. సిక్కులు హిందువులు కావాలంటే శుద్ధి కార్యక్రమంలో పాల్గొనాలనే ఆలోచనను పెంచటం జరిగింది. అయితే ఇది మంచి ఆలోచన కాదు. సిక్కులకు శుద్ధి అవసరం లేదు వారు హిందువులే అనే ఆలోచనను పెంచటానికి 1889 వ సంవత్సరంలో లాలా ఠాకూర్ హరదాస్‌గారు 'సిక్కులు కూడ హిందువులే' (**Sikhs are also Hindus**) అనే పుస్తకాన్ని ప్రచురించారు. అయినా సిక్కుల మనస్సులపై ఏర్పడిన గాయం మానలేదు 1895 వ సంవత్సరంలో కహాన్‌సింగ్ నభా అనే ఆయన 'మేము హిందువులం కాము' (**We are note Hindus**) అనే పుస్తకాన్ని ప్రచురించటం జరిగింది. ఈ భావనల కారణంగానే 1920

తరువాత సిక్కులకు మతం, రాజకీయం కలసిపోయాయి. గురుద్వారాల నిర్వహణకు ప్రబంధక్ కమిటీ (యస్.జి.పి.సి.) ఏర్పడి, ఆ కమిటీ రాజకీయాలలో కూడ జోక్యం చేసుకొనటం ప్రారంభించింది. అకాలీదళ్ రాజకీయ పక్షంగా ఆవిర్భవించింది. ఈ ఆలోచనలు, భావనలు స్వాతంత్ర్యా నంతరం కూడ కొనసాగాయి.

మొక్క వృత్తిమవుతూ

పంజాబ్ ప్రాంతంలో గ్రామాలలో సిక్కులు ఎక్కువగా నివసిస్తే, పట్టణాలలో యితర హిందువులు ఎక్కువగా నివసిస్తూ వచ్చారు. అలాగని గ్రామాలలో యితర హిందువులూ, పట్టణాలలో సిక్కులూ లేరని కాదు. గ్రామాలలో నివసించే సిక్కులు ఎక్కువమంది జాట్ కులానికి చెందిన వారు వ్యవసాయమే తమ వృత్తిగా కలవారు. పట్టణాలలో నివసించే సిక్కు కుటుంబాలకు యితర హిందూ కుటుంబాలకు యిచ్చి పుచ్చుకొనే సంబంధా లున్నాయి. ఒకే కుటుంబంలో ఒక కుమారుడు సిక్కు అయితే మరొక కుమారుడు హిందువుగా ఉండడం కూడ పట్టణాలలోనే కనిపిస్తుంది. అంతే కాదు సిక్కుల గురుద్వారాలను యితర హిందువులు సందర్శించటం, సనా తన ధర్మానికి చెందిన దేవాలయాలను సిక్కులు సందర్శించటం కూడ మనం అక్కడే చూడగలం. పంజాబ్ సమస్య పట్టణాలలో ప్రారంభం కాలే దని దీనివలన మనకు స్పష్టమవుతుంది.

1950 వ సంవత్సరం తరువాత పంజాబ్ ప్రాంతంలో వ్యవసాయక విప్లవం వచ్చింది. దానినే హరిత విప్లవం (Green Revolution) అంటున్నాం. దీని కారణంగా రైతులకు ప్రాముఖ్యం పెరిగింది. అంతేకాదు. రాజకీయాలలో కూడా వీరు ప్రవేశించి నాయకత్వం కోసం ప్రాకులాడటం ప్రారంభించారు. అంటే రైతులలో ఎక్కువగా ఉన్న జాట్ సిక్కులు రాజ

కీయాలలోకి ప్రవేశించి, నాయకత్వాన్ని సంపాదించి దానిని నిలుపుకోటానికి అన్ని విధాలుగా ప్రయత్నాలు ప్రారంభించారు. తమ కోర్కెలకు మతపరమైన రంగుపూస్తే మనకు అండదండలు పెరుగుతాయని, తమ ప్రత్యర్థులు బలహీనులవుతారని వారి ఆలోచన. మతాతీతంగా, సామాజిక ఆర్థిక సమస్యలు ఆధారంగా పనిచేసే రాజకీయ పక్షాలు బలహీన మయ్యాయి. అకాలీదళ్ సిక్కుల పార్టీ అయి 'ఓటు బ్యాంకు'లను ఏర్పచుకుని వాటిని పదిలపరచుకోటానికై మతపరమైన కోర్కెలను కోరటం, అతి సహజమయింది. అకాలీదళ్‌కు ప్రతిక్రియాత్మకంగా ఆలోచిస్తూ ఇతర హిందువులను తమ ఓటు బ్యాంకులుగా తయారు చేసుకోటానికి మిగిలిన రాజకీయ పక్షాలు ప్రయత్నిస్తూ వచ్చాయి.

మన దేశంలోని కొన్ని కమ్యూనిస్టు పార్టీలు ఈ నాడు పంజాబ్‌ను కాపాడాలంటు మాట్లాడినా, కమ్యూనిస్టులంతా ఒకప్పుడు భారతదేశాన్ని బహుళ జాతుల ఉపఖండంగా వర్ణిస్తూ వచ్చారు. అంటే బలహీనమైన మన స్తత్వం గలవారు కమ్యూనిస్టుల సిద్ధాంతాన్ని నమ్మే ప్రమాదమేర్పడింది. వాస్తవానికి కమ్యూనిస్టువారికీ సిద్ధాంతం నేర్పింది వారిగురువులు. తమ స్వార్థం కోసం వారు ప్రచారంచేస్తూ వచ్చిన ఈ సిద్ధాంత ప్రభావం పంజాబ్ ప్రత్యేక వాదుల పై ఉంది.

పాశ్చాత్యీకరణం పేరుతో సంస్కృతిక మతవిషయాలపై అశ్రద్ధ పెరగడంతో, గ్రామాల్లోని సిక్కులకు నగరాల్లోని యితర హిందువులకు మధ్య హోదాలో తేడా, ఏర్పడి అది సంఘర్షణకు దారితీసింది. ఈ సంఘర్షణ గ్రామీణ వాసులైన సిక్కులలో మత దురహంకారాన్ని సృష్టించింది.

ఫజల్ ఆలీ అధ్యక్షతన ఏర్పడిన రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణ సలహా సంఘం భాష ప్రాతిపదికగా రాష్ట్రాలకు పునర్ వ్యవస్థీకరించాలని

సూచించింది. అదే సమయంలో మాస్టర్ తారాసింగ్ పంజాబీ సుబాకావాలని ఆందోళనను ప్రారంభించాడు. అయినా అప్పటి నెహ్రూ ప్రభుత్వం పంజాబ్ ఏర్పాటుపై సరియైన అవగాహనకు రాలేక పోయింది. ఆందోళన తాత్కాలికంగా సన్నగిల్లినా ప్రత్యేక రాష్ట్ర భావన పూర్తిగా సమసిపోలేదు. మాస్టర్ తారాసింగ్ ప్రభావాన్ని అకాలీదళ్ ప్రభావాన్ని తగ్గించటానికి కాంగ్రెస్ పార్టీ పరోక్షంగా సంత్ ఫతేసింగ్‌ను నిలబెట్టింది. యిటువంటి వ్యవహారాలు స్వాతంత్ర్యానంతరం కాంగ్రెస్‌కు మామూలే. యితర పార్టీల ప్రభావము పెరుగుతోందన్నప్పుడు, ఆ పార్టీ నాయకులపై బురద చల్లటానికి ప్రయత్నించటం, ఆ పార్టీలో అంతః కలహాలను సృష్టించి చీల్చటానికి ప్రయత్నించటం సామాన్యంగా జరిగే పనులు. అలా ప్రాముఖ్యాన్ని సంపాదించుకున్న సంత్ ఫతేసింగ్, తాను నాయకత్వాన్ని సంపాదించుకుని, ఆ నాయకత్వాన్ని నిలుపుకోవాలని తలచి, ప్రత్యేక పంజాబ్ రాష్ట్రం కోసం ఆందోళన ప్రారంభించి, ఆత్మాహుతి చేసుకుంటానంటూ కేంద్ర ప్రభుత్వాన్ని బెదిరించాడు. ఆనాడు ప్రధానమంత్రిగా ఉన్న లాల్‌బహదూర్‌శాస్త్రి ప్రత్యేక పంజాబ్ రాష్ట్ర ఏర్పాటుకు అంగీకరించక తప్పలేదు. అయితే చండీగఢ్ నగరం వివాదాస్పదంగా తయారవటంతో దానిని కేంద్ర పాలిత ప్రాంతంగా ఏర్పరచి హిందీ భాష మాట్లాడే వారుఎక్కువగా ఉన్న ప్రాంతాలతో హర్యానా రాష్ట్రాన్ని ఏర్పరచారు. చండీగఢ్‌ను తమకే యివ్వాలని పంజాబ్ ప్రాంతం తరచుగా అడుగుతూనే ఉంది. అయితే చండీగఢ్‌ను కోల్పోవటం వలన తాము రాజధానిని కోల్పోతున్నందున దానికి బదులు కొంత భూభాగాన్ని, కొంత నష్టపరిహారాన్ని యివ్వాలని హర్యానా పట్టుపడుతోంది అలాగే ఫజిల్కా ప్రాంతంలో హిందీ మాట్లాడే వారు ఎక్కువగా ఉన్నందున ఆ ప్రాంతాన్ని హర్యానాకు బదిలీ చేయాలని కూడ వారి వాదన. ఈ వాదోపవాదాలు యిలా కొనసాగుతూనే ఉన్నాయి.

2)

కాంగ్రెసు రాజకీయాలు :

స్వాతంత్ర్యం వచ్చిన వెంటనే 1949-52 సంవత్సరాల మధ్య సంయుక్త పంజాబ్ లో అకాలీదళ్-కాంగ్రెస్ పార్టీలు కలిసి సంకీర్ణ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసాయి 1952-57 ల మధ్య కాంగ్రెస్ ప్రభుత్వమే కొనసాగింది. తిరిగి 1957-62 సంవత్సరాల మధ్య అకాలీ దళ్-కాంగ్రెస్ పార్టీలు సంయుక్తంగా మిశ్రమ ప్రభుత్వాన్ని ఏర్పరచి పంజాబ్‌ను పరిపాలించాయి. 1967 సాధారణ ఎన్నికల తరువాత హర్యానా విడిపోయిన తరువాత జరిగిన ఎన్నికలలో అకాలీదళ్ అత్యధిక సీట్లను సంపాదించుకుని, జనసంఘ్‌తో కలిసి యునైటెడ్ ఫ్రంట్ మంత్రి వర్గాన్ని ఏర్పరచింది. సిక్కులకు ప్రాతినిధ్యం వహిస్తున్న అకాలీదళ్, ఇతర హిందువులకు ప్రాతినిధ్యం వహిస్తున్న జనసంఘ్ కలిసి ప్రభుత్వాన్ని ఏర్పరచాయికాబట్టి రాష్ట్రంలో సుస్థిరత ఏర్పడుతుందని ప్రభుత్వం పటిష్ట వంతంగా ఉంటుందని ఊహించబడింది. అయితే కాంగ్రెస్ తన సహజ లక్షణాన్ని పోగొట్టుకోలేక పోయింది.

అకాలీదళ్‌లో పదవులు రానివారిని చేరదీసి, పదవుల ఎరను చూపించి, వారు అకాలీదళ్‌నుండి వేరు పడేటట్లు కాంగ్రెస్ ప్రయత్నించింది తత్ఫలితంగా కొందరు అకాలీదళ్‌కు రాజీనామాచేసి కాంగ్రెసుతో కలిసి ప్రభుత్వాన్ని ఏర్పరచారు. ఆ ప్రభుత్వంలో ఆర్థిక మంత్రిగా వ్యవహరించిన వ్యక్తి జగ్‌జిత్‌సింగ్ చౌహాన్. ఆయనే ఖలిస్థాన్ ఉద్యమానికి ముఖ్యుడు కూడ.

కాంగ్రెస్ చర్యను గర్హిస్తూ, ప్రజాభిప్రాయం పెరగటంతో, ఆ ప్రభుత్వం తొలగించబడింది. 1969 లో మధ్యంతర ఎన్నికల తరువాత అకాలీదళ్ ప్రభుత్వమేర్పడింది. ఈ ప్రభుత్వంకూడ ఎక్కువకాలం కొన

సాగలేదు. కేంద్రంలో ఉన్న కాంగ్రెస్ తిరిగి తన పాత ఆటనే ప్రారంభిం చింది. అకాలీదళ్‌నుండి కొందరు రాజీనామా చేసినా, ప్రభుత్వాన్ని మాత్రం కాంగ్రెస్ ఏర్పాటు చేయలేక పోయింది. 1971 తర్వాత మళ్లీ ఎన్నికలు జరిగాయి. ఈ సారి ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీకే మెజారిటీ లభించింది. ప్రభుత్వము సహజంగానే కాంగ్రెస్ పార్టీ ఏర్పరచ గలిగింది.

కాంగ్రెస్ పార్టీ ప్రారంభించిన 'ఆయారాం - గయారాం' ఆటలో అకాలీదళ్ వెనుక బడిపోవటంతో, అకాలీదళ్ సభ్యులు ఆందోళన చెందటం ప్రారంభించారు. కాంగ్రెస్‌ను వారి ఆటలో ఓడించటం కష్టం. అందులో వారు సిద్ధహస్తులు. వారికి అలవికాని విషయమేమిటా అని ఆలోచించటం ప్రారంభించారు. మత రాజకీయాలు కాంగ్రెస్ వారి ఆటను కట్టించ గలవని భావించి, ఆ పంథాను ఎన్నుకొన్నారు. మత మౌఢ్యం పెరిగి పోయింది. సిక్కు మతానుయాయులకు అన్యాయం జరిగుతోంది, అనేనినాదం ప్రారంభమయింది. సిక్కులకు జరుగుతున్న అన్యాయాన్ని స్పష్టమైన విధం యితరులకు తెలియ చెప్పటానికి, అకాలీదళ్ పార్టీ విధానాన్ని, కార్యక్రమాలను రూపొందించటానికి ఒక కమిటీని 1972 డిసెంబరు 11వ తేదీన ఏర్పరచారు. ఆ కమిటీ దాదాపుగా పదినెలలు చర్చలు జరిపి, 1973వ సంవత్సరంలో అక్టోబరు 16, 17 తేదీలలో ఆనందపూర్ లో జరిగిన అకాలీదళ్ కార్యవర్గ సమావేశాలలో తమ నివేదికను సమర్పించింది ఆ నివేదికనే తీర్మాన రూపంలో కార్యవర్గం ఆమోదించింది. ఆ నాటి నుండి ఆ తీర్మానాన్నే భారత రాజకీయాల్లో ఆనందపూర్ సాహెబ్ తీర్మానంగా పేర్కొంటున్నారు.

ఆనందపూర్ సాహెబ్ తీర్మానం :

ఈ ఆనందపూర్ సాహెబ్ తీర్మానం యొక్క శుద్ధప్రతి యిది అని నిర్ధారించ లేక పోతున్నాం. రకరకాల పాఠాలతో పాటు రకరకాల

వ్యాఖ్యానాలు ఈ తీర్మానానికున్నాయి. తీవ్రవాదులకు దీనితో సంబంధం లేదని చెప్పదలచుకున్నవారు అది రాష్ట్రాలకు ఎక్కువ అధికారాలను కోరే తీర్మానం మాత్రమే అన్నారు. కొందరు అది సిక్కు జాతీయవాదాన్ని ప్రతిపాదించే తీర్మానమన్నారు. సంత్ హర్‌చంద్. లాంగోవాల్ అనుయాయులు తాము ఖలిస్థాన్‌కు వ్యతిరేకులమనీ, దేశ సమగ్రత కాపాడబడటం కోసం తాము ప్రయత్నిస్తామని చెప్తూనే ఆనందపూర్ సాహెబ్ తీర్మానం అమలు కావాలి అంటూ ఉంటారు. తీవ్రవాదులు ఖలిస్థాన్ కావాలంటూ అది ఆనందపూర్ సాహెబ్ తీర్మానంలోనే ఉందంటారు. నిష్పక్షపాతంగా ఆనందపూర్ సాహెబ్ తీర్మానాన్ని పరిశీలించే వ్యక్తి యొక్క దృష్టిలో రెండు విషయాలు పడకమానవు. వేర్పాటు వాద బీజాలు అందులో ఉన్నాయన్నది మొదటి విషయం. సిక్కులకు ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు చేయటమంటే లౌకిక ప్రజాస్వామ్య సూత్రాలకు వ్యతిరేకంగా, మత మౌఢ్యం ఆధారంగా చేయటమే అన్నది రెండవ విషయం.

శిరోమణి అకాలీదళ్ యొక్క రాజకీయ లక్ష్యాన్ని నిర్వచిస్తూ ఆనందపూర్ సాహెబ్ తీర్మానం యిలా సూచిస్తుంది "నిస్సందేహంగా పంథ్‌యొక్క రాజకీయ లక్ష్యం పదవ గురువు యిచ్చిన ఆజ్ఞలలో, సిక్కు చరిత్రలో, ఖల్సాపంథ్ మౌలిక సూత్రాలలో వ్యక్తమవుతుంది. ఖల్సా అత్యున్నత స్థానాన్ని పొందటమే అంతిమ లక్ష్యం. శిరోమణి అకాలీదళ్ యొక్క మౌలిక ఉద్దేశ్యం ఖల్సా జన్మభూమిని సాధించటమే. దాని కోసం తగిన వాతావరణాన్ని రాజకీయ వ్యవస్థను నిర్మించటమే విధానం". పంథ్ సంప్రదాయంయొక్క ప్రత్యేక అస్థిత్వమంటు మాట్లాడిన తరువాత ఆనంద పూర్ సాహెబ్ తీర్మానంలో వేర్పాటు వాదం లేదని ఎలా చెప్పగలం? ప్రమాదకరమైన సిక్కు జాతీయత గురించి కూడ అది మాట్లాడుతోంది. అంతే కాదు, సిక్కులకు సంబంధించినంతవరకు మతం, రాజకీయాలు ఒక

దానితో మరొకటి పెనవేసుకుని ఉన్నాయనీ, సిక్కు సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలపై ఆధారపడి తమకొక ప్రత్యేక రాష్ట్రం కావాలనీ ఆ తీర్మానం కోరుతోంది. ఈనాడు తీవ్రవాదుల ఖలిస్థాన్ నినాదం గురించీ, తమ వేర్పాటు వాదాన్ని సమర్థించుకోటానికి ఆనందపూర్ సాహెబ్ తీర్మానాన్ని ఉటంకించటం గురించి ఆందోళన చెందుతున్న వారు ఆనాడు ఆ తీర్మానాన్ని వ్యతిరేకించలేదు. కారణం ఏదైనా కావచ్చు.

ఆ తీర్మానం చాలా కాలం అజ్ఞాతంలోనే ఉంది. అకాలీదళ్ ఆ తరువాత అనేక జాతీయోద్యమాలలో పాల్గొంది. అత్యయిక పరిస్థితికి వ్యతిరేకంగా 1975 నుండి 1977 వరకు జరిగిన పోరాటంలో అకాలీదళ్ పాల్గొంది. రాజకీయాల వత్తిడి ఆనందపూర్ సాహెబ్ తీర్మానాన్ని వెనుకకు నెట్టింది. 1977 నాటి లోక్‌సభ ఎన్నికల సమయంలో కాని, శాసన సభ ఎన్నికల సమయంలో కాని అకాలీదళ్ తమ ఎన్నికల ప్రణాళికలో ఆనందపూర్ సాహెబ్ తీర్మానాన్ని పేర్కొనలేదు. జనతా పార్టీతో కలిసి రాష్ట్రంలోను, కేంద్రంలోనూ ప్రభుత్వంలో పాలు పంచుకుంది. అకాలీదళ్ నాయకత్వం కూడ తాము ఆనందపూర్ సాహెబ్ తీర్మానాన్ని విస్మరించటం మంచిదని భావించింది. అందుకనే 1978 లో అక్టోబరు 28, 29 తేదీలలో లూధియానాలో అకాలీదళ్ సర్వసభ్య సమావేశంలో మరొక తీర్మానాన్ని ఆమోదించింది. ఆ తీర్మానాన్ని గురుచరణ్ సింగ్ తోహ్రా ప్రతిపాదించగా, ప్రకాశ్‌సింగ్ బాదల్ సమర్థించారు అయితే ఈ తీర్మానానికి కూడ ఆనంద పూర్ సాహెబ్ తీర్మానమే ప్రాతిపదిక. అంతేకాదు దీనిని కూడ ఆ పేరుతోనే పిలవటం ప్రారంభించి ఇందులో వేర్పాటువాదం లేదంటూ పదే పదే చెప్తూ వచ్చారు. ఇందులో పంథ్ సంప్రదాయం యొక్క గొప్పతనం గురించీ లేదు, ఖల్సా జన్మభూమిని సాధించటానికై వాతావరణ నిర్మాణం, రాజకీయ వ్యవస్థను ఏర్పరచుకోవటం గురించీ లేదు,

లూథియానా తీర్మానం చివరిలో యిలా ఉంది "దేశంలో ఉన్న భిన్న భాషా, సంస్కృతిక వర్గాలను, మతపరమైన అల్ప సంఖ్యాక వర్గాలను, కోట్ల జనాభా కోరికను జనతా ప్రభుత్వం మన్నించి, జాతీయ సమైక్యతకు, సమగ్రతకు భంగం వాటిల్లకుండా, రాష్ట్రాలు తమ ప్రాంతాల లోని ప్రజల శ్రేయస్సుకై తమ అధికారాలను సక్రమంగా వినియోగించటానికై, మన రాజ్యాంగాన్ని వాస్తవమూ ఆచరణయోగ్యమూ అయిన ఫెడరల్ సూత్రాలు ఆధారంగా తిరిగి రచిస్తే బాగుంటుంది". 1978 నాటి ఆనందపూర్ సాహెబ్ తీర్మానంలో ప్రతిపాదించిన వేర్పాటువాదానికి భిన్నంగా 1978 నాటి లూథియానా తీర్మానంలో జాతీయ సమైక్యతకు సమగ్రతకు భంగం వాటిల్లకుండా కేంద్రం-రాష్ట్రాల మధ్య సంబంధాలను పునర్వ్యవస్థీకరించాలన్నారు. దీనిని కూడ ఆనందపూర్ సాహెబ్ తీర్మానమే అనటంతో గందరగోళ పరిస్థితి ఏర్పడింది. ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే ఈ తీర్మానం విషయంలో కూడ అందరూ నిర్లిప్తంగానే ఉన్నారు. అకాలీదళ్ నాయకత్వం కూడ దీనిని ప్రచారంలోకి తీసుకరావటానికి ఎటువంటి ప్రయత్నమూ చేయలేదు. 1980 లో శ్రీమతి ఇందిరా గాంధీ తిరిగి అధికారంలోకి వచ్చేదాకా దీనిని గురించి ఎవ్వరూ పట్టించుకోలేదు. అదే సమయంలో అకాలీదళ్‌లో చీలిక వచ్చింది. చీలిపోయిన వారిని తల్వండి వర్గం అన్నారు. ఆ తల్వండి వర్గం ఆనందపూర్ సాహెబ్ తీర్మానాన్ని అమలుపరచాలని ఉద్యమాన్ని ప్రారంభించారు కాని దానికి ఎక్కువగా ప్రాముఖ్యం లభించలేదు. అదే సమయంలో ముఖ్యమైన శిరోమణి అకాలీదళ్ వర్గం (అధికార వర్గం) నదీజలాల సమస్యపై ఉద్యమాన్ని నిర్వహిస్తూ వచ్చింది.

## రాజ్యాంగంలో 370 వ నిబంధన :

ఆనందపూర్ సాహెబ్ తీర్మానం పేరుతో ఎన్ని రకాల పాఠాలున్నా అన్నిటి వెనుక రాజ్యాంగంలోని 370 వ నిబంధన ప్రభావమున్నది. ఆ నిబంధ

ధన కారణంగా జమ్మూ కాశ్మీర్ ప్రాంతానికి ప్రత్యేక ప్రతిపత్తి యివ్వ బడింది. పాకిస్థాన్ కాశ్మీర్ పై చేసిన దండయాత్ర కారణంగా, షేక్ అబ్దుల్లాకు అనవసర ప్రాధాన్యాన్నిచ్చి, జవహార్‌లాల్ నెహ్రూ దేశంపై రుద్దిననిబంధనయిది. దీని కారణంగా నాగాలాండ్, మిజోరామ్ ప్రాంతాలలో కూడ ఇటువంటి ప్రత్యేక ప్రతిపత్తినే కోరుతున్నారు. అందువలన ఈ నిబంధనను వెంటనే రాజ్యాంగం నుండి తొలగించాలి బి జె పి. అధ్య క్షులు యల్.కె. అద్వాని ఈ నిబంధన గురించి మాట్లాడుతూ యిలా అన్నారు. "370 వ నిబంధన ఒక చారిత్రకంగా ఏర్పడిన అవక్రం. దానిని ఎంత తొందరగా తొలగిస్తే అంతమంచిది. సరిహద్దు ప్రాంతంలో ఉన్న మరొక రాష్ట్రానికి దానిని వర్తింప జేయాలనుకోవటం తిరోగమన చర్య. అంతేకాదు దేశ భద్రతకే ప్రమాదకరం."

రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్ అఖిల భారతీయ ప్రతినిధి సభ 1986 మార్చి నెలలో సమావేశమైనప్పుడు ఆమోదించిన ఒక తీర్మానంలో ఈ నిబంధన గురించి యిలా పేర్కొనటం జరిగింది. "కాశ్మీర్‌లో జాతీయ సమైక్యతకు రోజు రోజుకు పెరుగుతున్న ప్రమాదం, రాజ్యాంగంలోని 370 వ నిబంధనను వెంటనే తొలగించమని బోధిస్తోంది. 370వ నిబంధన కాశ్మీర్‌లోని విచ్ఛిన్నకర శక్తులకేకాదు పంజాబ్ మిజోరామ్ ప్రాంతాలలోని తీవ్రవాదులు కూడా ప్రత్యేక ప్రతిపత్తిని కోరటానికి అవకాశాన్నిస్తోంది."

జాతీయ సమైక్యతకు హానికరంగా తయారయిన 370 వ నిబంధ నను పూర్తిగా రద్దు చేయాలన్న ఆలోచన కేంద్ర ప్రభుత్వానికి కలుగక పోవటం శోచనీయం.

భింద్రన్ వాలా ప్రవేశం

1977 తరువాత అకాలీదళ్-జనతా పక్షాల ప్రభుత్వం అధికారంలోకి రావటం కాంగ్రెస్ సహించలేక అకాలీదళ్‌ను అధికారం నుండి తొలగించటానికై రకరకాల రాజకీయ, మత పరమైన కోర్కెలను బయట పెట్టించ్చింది. అటువంటి కోర్కెలను బయట పెట్టటానికి ఎవరు పనికి వస్తారని ఆలోచించి భూతద్దంతో వెదకి భింద్రన్‌వాలాను పట్టుకోవటం జరిగింది

భారత దేశానికి స్వాతంత్రము వచ్చిన సంవత్సరమే అంటే 1947లో జార్నైయిల్ సింగ్ బ్రార్ జన్మించాడు ఆయన తండ్రి పేరు జాతేదార్ జోగిందర్‌సింగ్. తల్లిపేరు నిహాల్‌కౌల్. అమృత్‌సర్ నుండి 135 కిలో మీటర్ల దూరంలో ఉన్న మోగ జిల్లాలో రోదె (Rhode) గ్రామంలో జన్మించాడు. దగ్గరలో ఉన్న దమ్ దమా సాహెబ్ గురుద్వారాతో అతని కుటుంబానికి దగ్గర సంబంధాలున్నాయి జోగిందర్‌సింగ్ యొక్క ఏడుగురు కుమారులలో ఆఖరివాడు జార్నైయిల్‌సింగ్. ప్రాథమిక విద్య అనంతరం సంత్ గుర్బచన్‌సింగ్ ఖల్సా వద్దకు జార్నైయిల్ సింగ్‌ను పంపించటం జరిగింది ఆయన భింద్రన్ గ్రామంలో ఉండటం కారణంగా జార్నైయిల్ సింగ్ బ్రార్‌ను అనాటినుంచి భింద్రన్‌వాలా అని పిలాటం ప్రారంభించారు. 1966లో ప్రీతమ్ కౌర్‌తో జార్నైయిల్ సింగ్ భింద్రన్ వాలా వివాహం జరిగింది. యిద్దరు కుమారులు కూడా జన్మించారు. వారి పేర్లు ఈశ్వర్‌సింగ్ ఇందర్‌జిత్ సింగ్.

1971 లో సంత్ గుర్బచన్ సింగ్ మరణానంతరం సంత్ కర్తార్ సింగ్ దమ్‌దమా సాహెబ్ ఆధిపత్యాన్ని స్వీకరించాడు. ఈయన కుమారుడు అమ్రిక్‌సింగ్ అఖిల భారత సిక్కు విద్యార్థిసమాఖ్య అధ్యక్షుడుగా తరువాత ఎన్నుకోబడ్డాడు. 1977 లో ఒక రోడ్డు ప్రమాదంలో సంత్

కర్తార్‌సింగ్ మరణించాడు. ఆయన తరువాత అధికారంలోకి వచ్చిన జార్నైయిల్ సింగ్, ఆనాటినుండి సంత్ జార్నైయిల్ సింగ్ భింద్రన్‌వాలా అయ్యాడు. 1978 ఏప్రెలు 13 వ తేదీ నిరంకారీల సమావేశానికి వ్యతిరేకంగా సిక్కులు నిర్వహించిన ప్రదర్శన ద్వారా భింద్రన్‌వాలా ప్రజాబాహుళ్యానికి పరిచితుడయ్యాడు.

నిరంకారీల సంప్రదాయంలో గురు పరంపర నేటికీ కొనసాగుతోంది. గురుగోవిందసింగ్ తరువాత గురుగ్రంథ సాహెబ్ మాత్రమే గురువని యితరులు భావిస్తారు. అందువలన నిరంకారీలకు యితర సిక్కులకు పడదు. ఆ కారణంగానే 1978 ఏప్రెల్‌లో జరిగిన నిరంకారీ సమావేశానికి వ్యతిరేకంగా ప్రదర్శన నిర్వహించాలని నిర్ణయించారు.

1977 లో కాంగ్రెస్ పార్టీ ఓడిపోయిన తరువాత జ్ఞాని జెయిల్ సింగ్ ముఖ్యమంత్రి పదవిని కోల్పోయారు అకాలీదళ్ ప్రభుత్వం, జెయిల్ సింగ్ ముఖ్యమంత్రి పదవిని నిర్వహించిన కాలంలో అధికార దుర్వినియోగానికి పాల్పడ్డారనీ, దానిమీద విచారణ జరుపమనీ గురుదయాళ్ సింగ్ సంఘాన్ని నియమించింది. ఆ విచారణనుండి తప్పించుకోలేక, అకాలిదళ్‌ను దెబ్బకొట్టటానికై మార్గాలను వెదుకసాగాడాయన అంటారు. మతపరంగా ఆలోచించి ఒక గురుద్వారా అధికారిని లేదా సంత్‌ను అకాలీదళ్‌కు వ్యతిరేకంగా ప్రయోగించవచ్చని సంజయ్‌గాంధీ సూచించాడని కూడ చెప్తారు. ఆ సూచన ప్రకారం జెయిల్‌సింగ్, దర్బారాసింగ్ కలిసి యిద్దరిని ఎంపిక చేశారట ఆ యిద్దరిలో ఒకరిని సంజయ్‌గాంధీ ఎన్నుకున్నాడట. అలాఎన్నోకోబడ్డ వ్యక్తే భింద్రన్‌వాలా 1978, 1979లలో భింద్రన్‌వాలా. కాంగ్రెస్ మనిషిగానే వ్యవహరించాడు. ఆనాటి అకాలీదళ్ ముఖ్యమంత్రి ప్రకాశ్‌సింగ్ బాదల్‌ను విపరీతంగా తిడ్తూ ఉండేవాడు. జ్ఞాని జెయిల్‌సింగ్

ఫరీద్‌కోట అధికారిచేత భింద్రన్‌వాలా అను యాయులకు తుపాకీ లైసెన్సులు యిప్పించాడని చెప్పుకుంటారు. కాంగ్రెస్‌నుండి అతనికి డబ్బు కూడా ముట్టిందని పలువురి అభిప్రాయం.

1980 నాటి ఎన్నికలలో జ్ఞాని జెయిల్‌సింగ్. శ్రీమతి సుఖ్‌జిందర్ కౌర్ కాంగ్రెస్ అభ్యర్థులు. వారిద్దరి తరపున భింద్రన్‌వాలా ఎన్నికల ప్రచారంలో పాల్గొనటమే కాదు తన మనుష్యులను పోలింగ్ ఏజెంట్లుగా నియమించాడు కాంగ్రెస్ విజయం తరువాత భింద్రన్‌వాలా పలుకుబడి పెరిగింది.

మేజర్ జనరల్ సుభేగ్‌సింగ్ అవినీతికి పాల్పడటం కారణంగా ఉద్యోగాన్ని పోగొట్టుకున్న సైనికోద్యోగి. మతమంటే పెద్దగా అభిమాన మేమీ లేదు. కాని ఉద్యోగం ఊడిపోగానే ప్రభుత్వంమీద ద్వేషంతో ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలలో పాల్గొనటం ప్రారంభించాడు. అలా భింద్రన్‌వాలాతో పరిచయం ఏర్పడి పెరిగింది. చివరకు ముఖ్య సలహా దారుడి స్థాయికి ఎదిగాడు.

సంత్ కర్తార్ సింగ్ కుమారుడు అమ్రిక్ సింగ్. అఖిల భారత సిక్కు విద్యార్థి సమాఖ్య అధ్యక్షుడు. భింద్రన్‌వాలాకు పూర్వం దమ్‌దమా సాహెబ్ ఆధిపత్యాన్ని వహించిన వ్యక్తి కుమారుడయినందున అతనుకూడ భింద్రన్‌వాలాకు సన్నిహితుడయి సలహాదారు డయ్యాడు.

1981 వరకు భయంతో మెలిగిన భింద్రన్‌వాలా 1982 లో పాకిస్థాన్ రహస్యంగా వెళ్ళివచ్చాడు 1983 వరకు కాంగ్రెస్ అండదండ లున్నాయి. కాని రానురాను అమ్రిక్ సింగ్, సుభేగ్ సింగ్‌ల ప్రభావం పెరిగింది. వారిద్వారా విదేశీ ఏజెంట్లతో సంబంధాలు పెరిగాయి. తీవ్ర

వాదులు చుట్టూ చేరారు. అతనికి తెలియకుండానే అతను తీవ్రవాదు డయ్యాడు. భయస్తుడయిన భింద్రన్‌వాలాలో అహంభావం పెరిగింది. దానికితోడు రాష్ట్రప్రభుత్వం, కేంద్రప్రభుత్వం అకాలీదళ్ కాంగ్రెస్ పార్టీలు అతనికి అనవసరమైన ప్రాముఖ్యాన్ని ఆపాదించాయి. అతనిని ఒక గొప్ప మతపరమైన నాయకుడిగా పార్లమెంటులో వర్ణించటానికి అందరూ ముందుకు వచ్చారు. రాజీవ్‌గాంధీ తాను ప్రధానమంత్రి పదవిని అధిరోహించక పూర్వం భింద్రన్‌వాలాను సిక్కుల నాయకుడుగానే పేర్కొనటం జరిగింది. ప్రతిపక్షాలవారు ఆ విషయంమీద వ్యాఖ్యానించారు కూడ.

## తీవ్రవాదం ముసుగులో హింస

భింద్రన్‌వాలా పట్ల రాజకీయ నాయకులు ప్రదర్శించిన వైఖరి మిగిలిన తీవ్రవాదులకు ప్రోత్సాహకరంగా తయారయింది. కెనడా, యింగ్లాండు అమెరికా దేశాలలో నివాసమేర్పరచుకుని, కొన్ని సందర్భాలలో ఆదేశాల పౌరసత్వాన్ని కూడ తీసుకుని ధన సంపాదన బాగానేఉన్న సిక్కులు కొందరు తమ పలుకుబడిని పెంచుకోవటానికి వేర్పాటు వాదాన్ని ప్రోత్సహించటం అవసర మనుకున్నారు. ఆ విధంగా వేర్పాటు వాదంతో పాటు హింసాత్మక చర్యలకు పాల్పడే తీవ్రవాదులను కూడ సమర్థించటం అవసర మనుకున్నారు. తీవ్రవాదులచర్యలు నిర్ద్వంద్వంగా ఖండించవలసి ఉండగా, తమకా ధైర్యంలేక అకాలీదళ్ వారు కూడ వారికోర్కెలనే చిలుక పలుకుల వలె పల్లిస్తూ ఉండేవారు. భింద్రన్‌వాలా అనుచరులను అరెస్టుచేసినప్పుడు, అకాలీదళ్ వారిని విడుదల చేయాలని కోరింది. అలాగే బయట హత్యలకు పాల్పడి పోలీసులనండి తప్పించుకోటానికి గురుద్వారాలలో చేరుతున్నా అభ్యంతరం తెలపలేదు. స్వర్ణదేవాలయ సముదాయాన్ని కూడ అలాగే ఉపయోగించుకున్నా ఒక్కసిక్కు కూడ అభ్యంతర పెట్టలేదు. ఇది తమ బలహీనత అని అందరు సిక్కులు అంగీకరించక తప్పదు.

నెమ్మదిగా బ్యాంకు లూటీలతోను, దారిదోపిళ్ళతోను ప్రారంభమై విమానాలను దారిమళ్ళించటం, ఆపై తమను విమర్శించే పత్రికాసంపాదకు లను హత్యచేయటంవరకు హింసాకాండ పెరిగింది. లాలాజగత్ నారాయణ్, రమేశ్‌చంద్ర ఆ విధంగానే హత్య గావింప బడ్డారు.

1982 ఏప్రిల్‌నెలలో అమృతసర్ లోని శివాలయంలో ఖండించిన గోశిరస్సు, గోమాంస ఖండాలు పడవేసి ఒక కుడ్యపత్రాన్ని అంటించారు. "అమృతసర్‌లో బీడి చుట్ట, సిగరెట్టు వంటి వస్తువులను అమ్మటం ఆప నట్లయితే గోహత్య యిలాగే కొనసాగు తుంది'' అని ఆ పత్రంలో వ్రాసారు. దళ్‌ఖాల్సా ఆ పత్రాన్ని ప్రచురించినట్లు వ్రాసారు ఈ సంఘటన నగరంలో గొప్ప సంచలనాన్ని సృష్టించింది. అమృతసర్‌లో ఈ సంఘట నకు వ్యతిరేకంగా పెద్దఎత్తున నిరసనప్రదర్శనలు నిర్వహించబడ్డాయి. ఆ ప్రదర్శనలలో అన్ని వర్గాలవారూ పాల్గొన్నారు. "గోహత్య చేసేవాడు సిక్కు కానేరడు. సిక్కుగురువులు గో, బ్రాహ్మణ రక్షణ కోసం నిరంత రం కృషిచేసారు'' అంటూ సిక్కు నాయకులు ప్రకటించారు. కొంతమంది ఈ సంఘటనకు ప్రతిక్రియాత్మకంగా గురుద్వారాలలో, స్వర్ణదేవాలయ ప్రాంగణంలో సిగరెట్టు పెట్టెలూ, బీడిముక్కలూ పడవేసారు. పరిస్థితి మరీ విషమించింది. హింసాకాండ పెచ్చుపెరిగింది. అనేకసార్లు ప్రభుత్వం కర్ఫ్యూను విధించవలసి వచ్చింది.

1981 మార్చినెలలో ఆనందపూర్ సాహెబ్‌లో జరిగిన ఒక తీవ్ర వాదుల సమావేశంలో ఖలిస్థాన్ జండాను ఎగురవేసారు. ఆ సమావేశానికి దళ్‌ఖల్సా సమావేశమని పేరు పెట్టుకున్నారు. అదే సంవత్సరం స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలలో హరిసమరన్ సింగ్ ఖలిస్థాన్ జండాను ఎగురవేసాడు. శాసనసభలో ప్రవేశించి ఖలిస్థాన్ జిందాబాద్ అంటూ నినా ధాలు చేసి, కరపత్రాలను వెదజల్లారు.

మన పొరుగు దేశమైన పాకిస్థాన్ భారతదేశానికి మరింత యిబ్బంది కలుగజేస్తే తనకు లాభమని భావించింది. అందులోనూ తూర్పు పాకిస్థాన్ బంగ్లాదేశ్‌గా చీలిపోవటానికి ముఖ్య కారణం భారతదేశం కాబట్టి, ఆ భారత దేశాన్ని చీల్చి పగ తీర్చుకోవాలనే తపన ఎక్కువగా పాకిస్తాన్‌లో కనపడ సాగింది. దానికోసం తీవ్ర వాదులకు ఆయుధాలను ఉపయోగించటంలో శిక్షణ, ఆయుధ సామగ్రి సరఫరా మొదలైన సహాయ సహకారాలను అందజేయ సాగింది. అలాగే తన ఏజెంట్లను సిక్కు వేషంతో పంజాబ్ ప్రాంతంలో తిప్పి వేర్పాటు వాద ప్రచార కార్యక్రమాన్ని నిర్వహించింది. సిక్కు మత ప్రచారానికై శ్రీ గురుద్వారా ప్రబంధక్ కమిటీచే నియమించ బడిన సంచార ప్రచారకులు రాగి, దాడి అనేవారు వారు పాటల రూపంలో కీర్తనల రూపంలో మత ప్రచారం చేస్తూ ఉంటారు. యిప్పుడు కొంత మంది వేర్పాటు వాద ప్రచారాన్ని మత ప్రచార ముసుగులో చేయ నారం భించారు. దానికి వారికి పాకిస్తానీ ఏజెంట్లనుండి ధనం లభించేది.

1982 లో ఆసియా క్రీడోత్సవాలు ఢిల్లీలో నిర్వహించబడ్డాయి. ఆ తరువాత అలీన దేశాల సమావేశం, కామన్వెల్త్ ప్రభుత్వాధి నేతల సమావేశం జరిగాయి. వీనికోసం గట్టి భద్రతా చర్యలు తీసుకొమ్మని ప్రభుత్వం ఆదేశించింది, ఆ విధంగా తీసుకున్న భద్రతా చర్యలలో భాగంగా చండీఘడ్ నుండి దేశ రాజధానికి వస్తున్న సిక్కుల నందరినీ తనిఖీ గురి చేసారు. "కాస్త కాల్చుకొమ్మంటే వళ్లంతా కాల్చుకున్నట్లు" ఆ భద్రతా చర్యలలో అమాయకులైన సిక్కు సోదరులు బాధలకు గురయ్యారు. దీనివలన కూడ వారి మనస్సులలో తాము ప్రత్యేకంగా బాధింపబడ్తున్నామనీ, ఈ అన్యాయానికి కారణంగా తాము సిక్కులుగా జన్మించటమేననీ భావించటం ప్రారంభించారు.

మరొక వైపు నిరంకారీ నాయకుడైన బాబా గురు బచన్‌సింగ్ హత్యతో, ప్రాతికేయులు లాలా జగత్ నారాయణ్ రమేశ్ చంద్రల హత్యలతో సంబంధమున్నదని తెలిసినా భింద్రన్ వాలాపై గాని అతని అనుచరులపై గాని ఎటువంటి చర్యను రాష్ట్ర ప్రభుత్వం గాని, కేంద్ర ప్రభుత్వం కాని తీసుకొనలేదు. రాజకీయ నాయకులు అతనిని తమ చెప్పు చేతలలో ఉంచుకుని, యితరులపై ప్రయోగించటానికి ప్రయత్నం చేసారు. ముఖ్యంగా దర్బారాసింగ్, జైల్‌సింగ్ భింద్రన్‌వాలాను తమ విధేయుడుగా చేసుకోవటానికి విపరీతంగా తాపత్రయ పడ్డారు. అందువలన అతని అత్యాచారాలను భరిస్తూ వచ్చారు. 1982లో తన అనుచరులతో సహా భింద్రన్ ఢిల్లీ వెళ్ళినా అతనిని అరెస్టు చేయలేదు.

**క్షీణిస్తున్న శాంతి భద్రతలు :**

ఆ తరువాత కొద్ది కాలంలోనే భింద్రన్ వాలా తన మకామును గురు ద్వారాకు మార్చాడు. అప్పటినుంచీ అతనిని అరెస్టు చెయ్యటం చాల కష్టమైన వ్యవహారంగా మారింది. అకాలీదళ్ వారు కూడ ఆయనకు ప్రాముఖ్యాన్నివ్వటం ప్రారంభించారు. తీవ్రవాదులు ఆయన చుట్టూ చేరారు. వారి అగడాలు పెరిగిపోయాయి. చివరికి స్వర్ణ దేవాలయం ముందు పట్టపగలు డి.ఐ.జి. హోదాలో ఉన్న అయిత్వాల్‌ను కాల్చి చంపారు. దర్బారాసింగ్ ప్రభుత్వం శాంతి భద్రతలను పరిరక్షించలేక పోతోందని, కేంద్రం రాష్ట్రపతి పాలనను విధించి, సైన్యాన్ని రాష్ట్రంలో దింపవలసి వచ్చింది.

ఉగ్రవాదులను మొదట్లో నిర్లక్ష్యం చేసి వారి అగడాలను భరించి, ఆ తరువాత వారు స్వర్ణదేవాలయ సముదాయాన్ని తమ కోటగా మార్చు కుని· ఆయుధ సామగ్రిని అందులో దాచిపెట్టుకుని, విదేశీ ఏజెంట్లను కూడ

ఆ దేవాలయ సముదాయంలోకి తెచ్చినప్పుడు వారిపై కేంద్రం తీసుకున్న సైనిక చర్యను 'ఆపరేషన్ బ్లూ స్టార్' అన్నారు.

కేంద్రం, పంజాబ్ సమస్యను పరిష్కరించడానికి తగిన సమయంలో శ్రద్ధ చూపించక పోవటం వలన తీవ్రవాదులకు ప్రాముఖ్యం లభించింది. అకాలీదళ్ నాయకులు కూడ తీవ్రవాదుల హింసాకాండను నిర్ద్వంద్వంగా ఖండించలేక పోవటం మరొక కారణం. వాస్తవానికి సంత్ హర్‌చంద్ లాంగోవాలా అంటే భింద్రన్‌వాలాకు భయమే. సంత్ ఓరుదుకు తగిన వ్యక్తి హర్‌చంద్. రాజకీయాలలోకి అనుకోకుండా ప్రవేశించాడు. తన పదహారవ ఏట అకాలీదళ్‌లో చేరాడు. మొదటి నుంచీ అహింసావాది. వేర్పాటువాదానికి కూడ వ్యతిరేకే. కాని భింద్రన్‌వాలా బలాన్ని సరిగ్గా అంచనా వేయలేక, అతనికి లేనిపోని ప్రాముఖ్యం యివ్వటంతో అతను అకుమేకై కూర్చున్నాడు. దానికి తగ్గట్టుగానే కేంద్ర ప్రభుత్వం మిత వాదులను దగ్గర తీసుకొనటం మాని, వారిని కూడ విమర్శించి, తీవ్రవాదులకు దగ్గరయ్యేటట్లు చేసింది.

1983 జూన్ నెల నాటికి తీవ్రవాదుల ఆగడాలు విపరీతంగా పెరిగాయి ఆ సంవత్సరం మే నెలలో ప్రధాని పంజాబ్ పర్యటిస్తున్నప్పుడు గురుదాస్‌పూర్‌లో యిద్దరు స్త్రీలు నాటుబాంబులను ప్రధానిపై విసిరారు. అకాలీదళ్ కేంద్రంతో తిరిగి రాయబారం ప్రారంభిస్తూ నదీ జలాలపై సరిహద్దు తగవుపై కేంద్రం అభిప్రాయాన్ని స్పష్టం చేయమని అడగటం జరిగింది. జూన్ నెలలో పి.యస్. భిందర్‌ను పోలీసు యినస్పెక్టర్ జనరల్‌గా నియమించారు. ఈ నెల 4 వ తేదినుండి నాలుగు రోజులు భింద్రన్ వాలా ఎక్కడ ఉన్నదీ ఎవరికీ తెలియదు. ఆపరేషన్ బ్లూస్టార్ తర్వాత దొరికిన పత్రాలు ఆధారంగా ఆ నాలుగు రోజులు అతను వేషం మార్చుకుని

పాకిస్థాన్ వెళ్ళాడని తెలిసింది. ఆ తరువాత కూడ మూడుసార్లు అతను పాకిస్థాన్ వెళ్ళి ఉండవచ్చు. మన దేశపు గూఢచారులు పాకిస్థాన్ నుండిపంపిన సమాచారం ప్రకారం అనేక మంది అమెరికన్లు, లాహోర్, మియాన్‌వాలాను దర్శించారు. మియాన్‌వాలాలో పాకిస్థాన్ సైనిక శిక్షణా కేంద్రం ఉంది. అక్కడే సిక్కు తీవ్రవాదులను కూడ శిక్షణ యివ్వబడిందని కొందరి అనుమానం. అమెరికా రాయబారి హారిబార్నెస్ ఈ సమయంలో ఒక పత్రికకు యిచ్చిన యింటర్వ్యూలో ఖలిస్థాన్ ఉద్యమాన్ని ప్యూర్టొరికోలో నియంతృత్వానికి వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటంతో పోల్చాడు.

ఒకప్రక్క తీవ్రవాదుల హత్యాకాండ, మరొక ప్రక్క సంత్ హర్ చంద్‌లాంగోవాలా రాయబారాలు కొనసాగుతూనే వచ్చాయి. పంజాబ్ పోలీసు అధికారులలో కొందరు తీవ్రవాదుల ప్రభావానికి లొంగిపోయారన్న వార్తలు కూడ బయటకు వచ్చాయి రాను రాను తీవ్రవాదుల దాడులలో మార్పు కనపడింది. ఉదాహరణగా గురుదాస్‌పూర్ జిల్లాలో పటన్ అనే గ్రామంలో నిహాంగ్‌లు ఒక ఉపాధ్యాయుని శిరస్సు ఖండించి, దానిని గ్రామమంతా ఊరేగించారు. బాబా బకాలావద్ద పోలీసు కేంద్రంపై నిహంగ్‌లు దాడిచేసిన తరువాత పోలీసులు వారి స్థావరంపై దాడిచేసి కొందరిని అరెస్టు చేస్తే, వారిని విడుదల చేయమని రాజకీయ నాయకులు కోరారు. కపుర్తలా జిల్లాలో ఫతేపింగా గ్రామంలో నలుగురు పోలీసులను తీవ్రవాదులు హత్య చేసి మూడు రైఫిళ్ళను ఎత్తుకుపోయారు.

అఖిల భారత సిక్కు విద్యార్థి సమాఖ్య అధ్యక్షుడైన అమ్రిక్ సింగ్‌ను, జాతేదార్ తారాసింగ్‌ను కేంద్రం అనుకోకుండా విడుదల చేసింది. అమ్రిక్‌సింగ్‌కు అకాల్‌తక్త్‌లో సరోపాను బహూకరించి గౌరవించారు. ఆ సమయంలో లాంగోవాలా, భింద్రన్‌వాలా అక్కడే ఉన్నారు.

తీవ్రవాదులను కేంద్రం విడుదల చేస్తూ వచ్చింది. అయినా భింద్రన్‌వాలా ఉద్రేకపూరిత ఉపన్యాసాలు తగ్గలేదు. పాకిస్థాన్ నుండి డబ్బు, ఆయుధాలు ధారాళంగా తీవ్రవాదులకు అందుతూనే ఉన్నాయి.

ఆపరేషన్ బ్లూస్టార్ :

అక్టోబరు నెలలో హౌరామెయిల్ పై, అమృత్‌సర్ నుండి ఢిల్లీ వెళ్లే ప్రయాణికుల బస్సుల పై తీవ్రవాదులు దాడిచేశారు. కేంద్రం రాష్ట్రపతి పాలనను విధించక తప్పలేదు. అయినా తీవ్రవాదుల హింసా కాండ తగ్గలేదు. భింద్రన్‌వాలా పంజాబ్‌నుంచి హిందువులు వెళ్లిపోవాలని ప్రకటించాడు హర్యానా రాజస్థాన్‌లలో హిందువుల ప్రదర్శించిన ప్రతి క్రియాత్మకత కూడ సమస్యను జటిలం చేసింది. రెండుమూడు సార్లు భింద్రన్ వాలాను అరెస్టు చేయటానికి కేంద్ర ప్రభుత్వం ప్రయత్నించింది. అయితే ప్రతిసారి ముందుగానే ఆయనకు సమాచార మందేది. తగు జాగ్రత్తలు తీసుకునే వాడు. అతను గురునానక్ నివాస్ నుండి మేజర్ జనరల్ సుభేగ్ సింగ్, అమ్రిక్ సింగ్‌ల సలహాలతో తన హింసను కొన సాగిస్తూనే వచ్చాడు. అయితే 1983 డిసెంబరు నెల పదహారవ తేది నాడు తనను అరెస్టు చేయబోతున్నారనీ తెలుసుకొని అకాల్ తక్త్‌కు తన మకాం మార్చాడు పాకిస్థాన్ నుండి అందిన రహస్య సమాచారం ప్రకారం ఆయుధ తిరుగుబాటుకు కుట్ర జరుగుతోంది. యిక ఆలస్యం చేసి ప్రయోజనం లేదని 1984 జూన్ నెలలో 3వ తేదీ ఆపరేషన్ బ్లూ స్టార్‌కు ఆజ్ఞయివ్వబడింది. వాస్తవానికి సైన్యం పై తీవ్రవాదులే ముందు కాల్పులు ప్రారంభించారు. సైన్యం తన చాకచాక్యాన్నంతా ఉపయోగించి సాధ్యమైనంత తక్కువ నష్టాన్ని కలిగించే విధంగా ప్రవర్తించింది. తీవ్ర వాదుల తరపున సుభేగ్ సింగ్ సైనిక చర్యకు సమాధానంగా కాల్పుల

ఆజ్ఞలను జారీ చేస్తూ వచ్చాడు. చివరికి జూన్ 7వ తేదీ అర్ధరాత్రికి కాల్పులు ఆగాయి. మధ్యలో భింద్రన్ వాలా లొంగి పోదామని ఆలోచించినా అతని సలహాదారులు పడనివ్వలేదని వార్త. భింద్రన్ వాలాను, సుభేగ్ సింగ్‌ను, అమ్రిక్ సింగ్‌ను సజీవంగా అరెస్టు చేయలేక పోయారు.

దెబ్బతిన్న మనస్తత్వం :

సైనిక చర్య కారణంగా సిక్కుల మనస్సులు తీవ్రంగా గాయపడ్డాయి. దానికి కారణం ఒకటి కాదు అనేకం. సైనికచర్య అయిన వెంటనే అమృత్‌సర్‌లోని కొంత మంది హిందువులు ప్రవర్తించిన తీరు బాధాకరంగానే ఉంది. కేంద్రం కూడ సక్రమంగా ప్రవర్తించినట్లు అనిపించదు. స్వర్ణదేవాలయ సముదాయం యొక్క కేంద్రం హర్‌మందిర్ సాహెబ్ - అక్కడే గురుగ్రంథ సాహెబ్ ఉండేది. అకాల్‌తక్త్ ముఖ్యమైనదే. ఆదిమధ్యాంత రహితుడు అంటే కాల పరిమితికతీతుడైన వాని స్థానమది. ఆ రెండూ పడిపోవటం - పడగొట్టబడటం - ఏ సిక్కూ ఊహించలేని విషయం సహించలేని విషయం కూడా.

అలాగే స్వర్ణదేవాలయమే కాదు యితర ముఖ్య గురుద్వారాలను కూడ తామే రిపేర్ చేసుకోవటం సిక్కుల పద్ధతి, దానినే కర్‌సేవా అంటారు. పడిపోయిన స్వర్ణదేవాలయ సముదాయాన్ని బాగు చేయటానికి జరుగవలసిన కర్‌సేవా కార్యక్రమానికి నాయకత్వం వహించటానికి ఎవ్వరూ ముందుకు రాలేదు. శ్రీ గురుద్వారా ప్రబంధక్ కమిటీ తాత్కాలిక అధ్యక్షుడు ఆత్మాసింగ్ ఆ పని తనవల్ల కాదన్నాడు. బాబా ఖరక్‌సింగ్ సైన్యం వైదొలగితేకాని కర్‌సేవ చేయలేమన్నాడు. చివరికి బాబా శాంతాసింగ్ అందుకు అంగీకరించాడు. అయితే అతనికి ఎక్కువగా

సహాయ పడింది సైనికులే. ఆ విషయం సిక్కులను మరింత బాధ పెట్టింది.

పంజాబ్ ప్రాంతం అదుపులోకి వచ్చిందని కేంద్రం భావించింది. కాని హింస ఏమాత్రం తగ్గనేలేదు. ఇండియన్ ఎయిర్ లైన్స్ వారి మరో విమానాన్ని దారి మళ్లించారు. యిలా విమానాన్ని మళ్లించటానికి పాకిస్థాని ప్రభుత్వ మద్దతు ఉన్నదని స్పష్టంగా అర్థమవుతూనే ఉంది. దారిమళ్ళించ బడిన విమానాన్ని మొదట లాహోర్ తీసుకవెళ్లారు. ప్రయాణికులు చెప్పిన కథనం ప్రకారం దారిమళ్లించిన ద్రోహులకు లాహోర్‌లో పిస్టళ్లు అందించబడ్డాయి. భారత ప్రభుత్వాన్ని మభ్యపెట్టటానికి కొంత మందిని పట్టుకున్నట్టే పట్టుకుని మనకు అప్పగించటం లేదు. విమానం లాహోర్ నుండి దుబాయి వెళ్లి అక్కడ నుండి ఢిల్లీ వచ్చింది. మొదట బయలుదేరిన ప్రయాణికులలో ఒకతను తిరిగిరాలేదు. ప్రయాణికుల సామాగ్రి కూడ పూర్తిగా ఢిల్లీ రాలేదు. అంతర్జాతీయ న్యాయశాస్త్రం ప్రకారం దోషులను భారతదేశానికి అప్పగించి వలసిన బాధ్యత ఉన్నా పాకిస్థాన్ నిర్లక్ష్యం చేసింది. 1984 లో సెప్టెంబరు నెలలో బస్సులో అమృత్‌సర్ నుండి వెళ్తున్న 18 మంది యితర హిందువులను దారుణంగా హత్యచేసారు.

సెప్టెంబరు 26 వ తేదీన స్వర్ణదేవాలయం నుండి సైన్యాన్ని వైదొల గించటానికి కేంద్రం అంగీకరించింది. దేవాలయం సిక్కు పూజారులకు అప్పగించబడింది. గురుబాణి, చండీపాఠ్ దేవాలయమంతా ప్రతిధ్వనిం చాయి. స్వర్ణదేవాలయం బాగు చేయబడినా సిక్కుల బాధ తగ్గినట్లు కని పించలేదు. తీవ్రవాదులు స్వర్ణదేవాలయం నుండి తొలగించబడ్డారు. కాని వారి చర్యలు మాత్రం ఆగలేదు.

జార్నైయిల్‌సింగ్ భింద్రన్‌వాలా కాంగ్రెస్ సృష్టించిన పెనుభూతం. అకాలీదళ్ రాజకీయాలను ఎదురుదెబ్బ కొట్టటానికి ఉపయోగించిన అస్త్రం. అయితే ఆ అస్త్రమే ఎదుటిపక్షం సంగతి అలా ఉంచితే, ప్రయోగించిన కాంగ్రెస్ పక్షానికే నష్టాన్ని తెచ్చి పెట్టింది. కాంగ్రెస్ అధీనంలో నుండి అమ్రిక్‌సింగ్, సుభేగ్‌సింగ్‌ల వర్గంలోకి మారి తన ఆధిపత్యాన్ని పెంచుకుందామని ప్రయత్నించి చివరకి పంజాబ్ ప్రజలకు దేశభద్రతకు హానికరంగా తయారయ్యాడు. స్వర్ణదేవాలయ సముదాయంలో తిష్ట వేసుకు కూర్చున్నాడు. అతనిని, అతని అనుచరులను అరెస్టు చేయకపోతే దేశానికే ప్రమాదం సంభవించే తరుణంలో 'ఆపరేషన్ బ్లూ స్టార్' జరిగింది.

అయితే ఆ ప్రయత్నం ఎదురు తిరిగింది. సిక్కులు శ్రీమతి గాంధీ తమ సంప్రదాయాన్ని నాశనం చేయాలని సంకల్పించింది అని భావించారు. మొదటినుంచీ, సమస్యను నానుస్తూ తమ ప్రాబల్యాన్ని పెంచుకొనటం కాంగ్రెస్ వారి అలవాటు. యిప్పుడు కూడా అలాగే చేయబోతే బెడిసి కొట్టింది. కాంగ్రెస్ పార్టీ ఒక్కటీ నష్టపోతే పరవాలేదు. కాని ఈసారి మాత్రం దేశమే నష్టపోయింది. శ్రీమతి గాంధీ, దేశ ప్రధాని హత్య గావింపబడ్డారు. అమాయకులైన సిక్కుయువకులు తీవ్రవాదం వైపు మొగ్గారు. ఈ నష్టాన్ని ఎలా పూర్తి చేయగలం? రాజకీయ పక్షాల అనాలోచిత చర్యలను భరించవలసిందేనా?

ప్రధాని హత్య :

అక్టోబరు 31 న ఉదయం 11 గంటల ప్రాంతంలో భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ తన నివాసంలో తన అంగరక్షకులచే హత్య చేయబడింది. తీవ్రవాదులు పన్నిన కుట్ర అందరినీ విభ్రాంతికి లోనయ్యేటట్లు చేసింది. మతమౌఢ్యం, విదేశీకుట్ర, స్వార్థ రాజకీయం తోడైతే విచక్షణా

జ్ఞానాన్ని కోల్పోతుందని మరొక్కసారి ఋజువయింది. ఒక దేశంలోని సామాన్యపౌరుని హత్య చేయటమే అన్యాయమని మనం చెప్తుంటే, యిక ప్రధానమంత్రిని హత్య చేయటం సంగతి వేరే చెప్పవలసిన పనిలేదు. ప్రధాని మంత్రి అంగరక్షక దళం వారే అత్యాచారానికి పాల్పడ్డారంటే, దేశ గూఢచారి దళంవారి అసమర్థత కూడ విదితమవుతుంది.

శ్రీమతి గాంధీ హత్యానంతరం దేశరాజధాని ఢిల్లీలోనూ, మరికొన్ని పట్టణాలలోనూ సిక్కులపై జరిగిన అత్యాచారం కూడ మన దేశానికి, మన సంప్రదాయాలకు అవమానకరమైనదే. మత మౌఢ్యంతో ముందూ వెనకా తెలియని కొందరు మూర్ఖులు ప్రధానిని హత్య చేసినందుకు సిక్కులనందరినీ ద్వేషించటమూ హింసించటమూ మంచిది కాదు. పి. యు. సి. యల్. వారు ప్రచురించిన నివేదిక ప్రకారం కాంగ్రెస్ పార్టీకి చెందిన కొందరు ప్రముఖ నాయకుల పేర్లు ఆ గందరగోళం వెనుక వినపడ్డాయి.

స్వర్ణదేవాలయంలో తీవ్రవాదులపై సైనికచర్య అనంతరం బాధపడిన సిక్కులు, శ్రీమతి గాంధీ హత్యతో దేశ సమగ్రతను కాపాడటం కోసం సైనికచర్య అవసరమయిందనే ఆలోచనకు దగ్గరకు వచ్చే అవకాశమేర్పడింది. కాని 1984 నవంబరు 1, 2 తేదీలలో జరిగిన సంఘటనలు తిరిగి సిక్కుల మనస్సులకు గాయం చేసాయి. దూరాలోచన లేని కొందరు మంచిపని జరిగిందని భావించినా రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్ అధినేత శ్రీ బాలాసాహెబ్ దేవరస్ అన్నట్లుగా "ప్రతి సిక్కు అకాలీదళ్ సభ్యుడు కాడు. ప్రతి అకాలీదళ్ సభ్యుడూ తీవ్రవాది కాడు." ఈ విషయాన్ని గ్రహించటం వలననే ఢిల్లీలో దురాగతానికి గురవుతున్న అమాయకులైన సిక్కు సోదరులను స్వయం సేవకులు ఆదుకో గలిగారు. ప్రముఖ పాత్రికేయుడు కుష్వంత్‌సింగ్ ఈ సందర్భంలో మాట్లాడుతూ "ఆర్.యస్.యస్.

ఒక పటిష్టమైన శిలవలె ఈ వత్తిడులను ఎదుర్కొంది." (R.S.S. Stood like a rock) అన్నారు. శ్రీమతి గాంధీ హత్య కంటె ముందు జరిగిన సంఘటనలను వర్ణిస్తూ కులదీప్ నయ్యర్, కుష్వంత్‌సింగ్‌లు సంయుక్తంగా "ది ట్రాజెడీ ఆఫ్ పంజాబ్" అనే గ్రంథాన్ని వ్రాయటం జరిగింది. అందులో కూడ పంజాబ్‌లో జరుగుచున్న దుర్ఘటన లన్నింటిలోనూ స్వచ్ఛమైన నడవడికతో తమ ఆత్మీయతను, దేశభక్తిని నిరూపించుకున్న వారు ఆర్. యస్. యస్. కు చెందిన స్వయం సేవకులు మాత్రమే అన్నారు. "దానికి కారణం వారి అధినేత సిక్కులు కూడ హిందువులే అని పదే పదే చెప్పటమే అని కూడ వ్రాసారు.

## రాజీవ్ చేసుకున్న ఒప్పందం

శ్రీమతిగాంధి హత్యానంతరం రాజీవ్‌గాంధీ ప్రధానికాగానే పంజాబ్ సమస్యకు రాజకీయ పరిష్కారాన్ని యివ్వటానికి ప్రయత్నించారు. దీనికి సంత్ హరచంద్ లాంగొవాలా కూడ తోడ్పడ్డారు. తత్ఫలితంగానే పంజాబ్ ఒప్పందం జరిగింది. ఈ ఒప్పందం నచ్చని తీవ్ర వాదులు సంత్ హర్‌చంద్‌ను హత్య చేసారు. అయినా ఒప్పందం ప్రకారం పంజాబ్‌లో ఎన్నికలు నిర్వహించబడ్డాయి. సామాన్య ప్రజలు తీవ్రవాదానికి వ్యతిరేకంగా, ప్రజాస్వామ్య జీవన విధానాన్ని సమర్థిస్తూ దేశసమైక్యతకు, సమగ్రతకు భంగంరాకూడదని భావిస్తూ ఎన్నికలలో పాల్గొన్నారు. తీవ్రవాదులు ఎన్నికలను భగ్నం చేయటానికి ప్రయత్నించారు. భింద్రన్‌వాలా తండ్రి జోగిందర్‌సింగ్ నాయకత్వంలో యునైటెడ్ అకాలీదళ్‌ను ప్రారంభించమని పిలుపునిచ్చారు. సంత్‌హర్‌చంద్ తరువాత అకాలీదళ్ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డ సుర్జిత్‌సింగ్ బర్నాలా తీవ్రవాదులను ఎదుర్కొని విజయవంతంగా ఎన్నికల ప్రహసనం నుండి బయట పడ్డాడు. మెజారిటీని సంపాదించుకొన్నాడు కాబట్టి ముఖ్యమంత్రి పదవినికూడ ఆయనేచేపట్టాడు.

అకాలీదళ్‌లో ఉన్న ప్రకాశ్ సింగ్ బాదల్, తోహ్రాలకు అది బాధాకరమైన విషయం. వారిద్దరూ కూడ ముఖ్యమంత్రి పదవిని ఆకాంక్షించిన వారే.

### కేంద్రం మరచిన బాధ్యత

1988 మే నెలలో పార్లమెంటు బడ్జెట్ సమావేశాలు ముగియగానే మే 14 వ తేదీ కేంద్రప్రభుత్వం ఒక ఆర్డినెన్సును విడుదలచేసింది. దాని ప్రకారం విచారణ సంఘాల నివేదికలను పార్లమెంటుకుగాని, రాష్ట్ర శాసన సభలకుగాని నివేదించ నవసరం లేదు. దేశసమగ్రత సమైక్యతల సంరక్షణ కోసం ప్రజా శ్రేయస్సుకోసం యిలాచేయవచ్చు అని ఆర్డినెన్సులో ఉంది. మే 15 వ తేదీ మరొక ప్రకటన విడుదల అయింది. ఆ ప్రకటనలో ప్రభుత్వం యిలా నివేదికలను పార్లమెంటు ముందు ఉంచకూడదని తలచి నప్పుడు అందుకై పార్లమెంటు అనుమతి అవసరము అని సూచించబడింది. మొత్తం మీద ఈ ఆర్డినెన్స్‌ద్వారా న్యాయమూర్తి ఠక్కర్ సంఘం శ్రీమతి గాంధీ హత్యపై జరిపిన విచారణా నివేదికను బహిర్గతం కాకుండా ఆపి వేయటం జరుగుతోంది. అంటే శ్రీమతి గాంధీ హత్యగురించి ప్రజలుతెలుసు కోకూడని విషయాలు బయటపడ్డాయన్న మాట. ఈ మధ్య కొన్ని పత్రి కలలో కొంతమంది నాయకుల గురించి కొన్ని వార్తలు ప్రకటించబడ్డాయి. వాటిలోని నిజానిజాలు గ్రహించాలన్నా ఠక్కర్ సంఘం నివేదికను పార్ల మెంటుకు సమర్పించాలి. శ్రీమతి గాంధీ హత్యకు కారకులైన హంతకులను వారి డ్యూటీ సమయాన్ని మార్చిన వ్యక్తి ఎవరు? అలా డ్యూటీని మార్చుట వలననే హంతకులకు హత్య చేయటానికి అవకాశం దొరికింది. శ్రీమతి గాంధీకి అత్యంత ఆప్తుడైన ధావన్ గురించి కూడ కొన్ని విషయాలుబయట పడ్డున్నాయి. ధావన్‌కు జరుగుతున్న అన్యాయం దృష్ట్యా కూడ ఠక్కర్ కమీషన్ నివేదికను బయటపెట్టాలి. అప్పుడు గాయపడిన సిక్కుల మనస్సు లను సేదదీర్చ నట్లవుతుంది. అందుకోసం కేంద్ర ప్రభుత్వం తప్పక కృషి

చేయాలి. అలా చేయకపోవటం వలననే ఆపరేషన్ బ్లూ స్టార్ తరువాత ఎందరో సిక్కు సైనికులు తమ బాధ్యతలను విస్మరించి సైన్యాన్ని వదలి పెట్టి పోయారు.

'ఆపరేషన్ బ్లూ స్టార్' తరువాత పత్రికలపై కొన్ని ఆంక్షలు విధించారు. అమృత్‌సర్ స్వర్ణదేవాలయంలో ఏమి జరిగిందీ చాలా మందికి తెలియలేదు. ప్రభుత్వ సమచార శాఖ చాలా రోజులు నిద్రపోయింది. తీవ్ర వాదులు మాత్రం స్వర్ణదేవాలయాన్ని సైన్యం పూర్తిగా పడగొట్టినట్లు ప్రచారం చేశారు.అందువలన చాలామంది సిక్కులు ఆ వార్తలనే నమ్మారు. వారిహృదయాలలో కనపడని గాయం చేయబడింది. ఎవరెన్ని విషయాలు చెప్పిన సామాన్యమానవుని విశ్వాసాలకు దెబ్బతగిలినప్పుడు అతను ఎలా ప్రవర్తిస్తాడో ఊహించలేము. అలా సైన్యాన్ని వదలి వెళ్ళి పోయారు కొందరు సిక్కులు. వారినే డెజెర్టర్లు అంటున్నారు.

అకాలీదళ్‌లో మరో చీలిక

పంజాబ్ ఒప్పందానికి ప్రజలు తమ అంగీకారాన్ని తెలిపారు కాబట్టి మొదట్లో బర్నాలాను వారు వ్యతిరేకించలేదు. బర్నాలాకూడ తీవ్ర వాదులను విడుదలచేసి వారి మెప్పును సంపాదించుదామనుకున్నాడు. కాని తీవ్రవాదులు మాత్రం వారి పాత ధోరణిని మానుకోలేక పోయారు. వారి వత్తిడి ఒకవైపు కేంద్ర ప్రభుత్వ అసమర్థత మరొక వైపు బర్నాలాను బాధించ సాగాయి. తీవ్రవాదుల పై చర్యతీసుకుంటే సిక్కులలో పలుకుబడి తగ్గుతుందని భయం, లేదా అకాలీదళ్‌లో పదవులు రానివారు ఆ సాకుతో తన పదవికి ఎసరు పెడ్తారని భయం. తీవ్రవాదులపై చర్యతీసుకొనకపోతే ఇతర హిందువుల వత్తిడి పెరగవచ్చు. కేంద్రం రాష్ట్రపతిపాలన విధించ వచ్చని మరొకవైపు భయం. బర్నాలా పని గందర గోళంలో పడ్డది.

చివరిక్షణంలో తప్పని సరి ఆపటం వలన స్వర్ణదేవాలయం నుండి తీవ్ర వాదులను తొలగించటానికి పోలీసులను 1986 ఏప్రిల్ 30వ తేదీ ఉపయోగించవలసి వచ్చింది. ఈ అదునుకోసమే చూస్తున్న బాదల్, తోహ్రా వర్గం బయటపడి మరొక అకాలీదళ్‌ను ప్రారంభించింది.

మొదటి నుంచీ అకాలీదళ్ చేస్తున్న తప్పనే బాదల్, తోహ్రా మళ్ళీ చేసారు. తీవ్రవాదులు మతంపేరిట, మత సంప్రదాయాలకు వ్యతిరేకంగా ఆయుధాలను గురుద్వారాలలో చేర్చి, అచ్చటి నుండి హింసాకాండను కొనసాగిస్తుంటే, అకాలీదళ్ నాయకత్వం ఏమీ అనలేక పోయింది. నేడు బాదల్, తోహ్రా కూడా ఏమీ అనటంలేదు. అంతేకాదు హింసకు పాల్పడిన తీవ్రవాదులను అరెస్టుచేయటానికి పోలీసులు గురుద్వారాలలో ప్రవేశించటాన్ని వీరు వ్యతిరేకిస్తున్నారు. తీవ్రవాదులు ఏర్పాటు చేసిన సభలలో పాల్గొంటున్నారు 1986 జూన్ మొదటి వారంలో స్వర్ణ దేవాలయంలో తీవ్రవాదుల ఆధ్వర్యంలో ఆపరేషన్ బ్లూస్టార్ రెండవ వార్షిక సమావేశం నిర్వహించబడింది. దీనిని షహీదీ సమావేశం అని కూడా అన్నారు. ఆ సమావేశంలో తీవ్రవాదులతో పాటు బాదల్ వర్గం కూడా పాల్గొంది. శ్రీమతి గాంధీని హత్య చేసిన హంతకుల నిద్దరినీ ఆ సమావేశంలో అమర వీరులుగా త్యాగపురుషులుగా వర్ణించారు. బియాంత్ సింగ్ భార్య బిమల్‌కౌర్ ప్రధాన అతిధిగా సమావేశానికి ఆహ్వానించ బడింది.

తీవ్రవాదులలో ప్రధానులుగా పేర్కొనబడ్డ బల్బీర్‌సింగ్, అజిత్ సింగ్‌లు పోలీసులతో జరిగిన సంఘర్షణలో మరణిస్తే, కేంద్రప్రభుత్వంపై కోపంతో, బర్నాలపై ద్వేషంతోవారి శ్రాద్ధ కర్మలకు'భోగ్' కార్యక్రమానికి బాదల్‌వర్గం హాజరైంది.

ప్రఖ్యాత చిత్ర నిర్మాత బి. ఆర్. ఛోప్రా నేటి పంజాబ్ పరిస్థితిని యిలా వర్ణించారు. "1947 నాటి సంఘటనల నీడలు తిరిగి పంజాబ్‌ను ఆవరిస్తున్నాయా అన్న భయం నాకు కలుగుతోంది. మారణ హోమం అప్పుడుకూడ పంజాబ్‌లోనే జరిగింది. పంజాబ్‌కు చెందిన వాడిగా బాధ పడ్తున్నాను. తీవ్రవాదాన్ని కఠినంగా అణచకపోతే ఎంత ప్రమాదమో? యిప్పటికే చాలా ఆలస్యమయింది. దేశ విభజనకు ముందు పంజాబ్ వాతా వరణం యిలాగే ఉండేది. యిదే పద్ధతిలో హత్యలు, యిదే పద్ధతిలో దాడులు. యిదే మతమౌఢ్యంతో కూడిన తర్కం. ప్రత్యేక దేశం కావాలనే కోరికకూడా అటువంటిదే. అల్ప సంఖ్యాకులయిన వారి మనస్సులలో భయాందోళనలు రేకెత్తించి, వారు గృహాలు విడిచి పారిపోయేట్లుచేయటం. ఈసారి తమ సోదరులనే తరుముతున్నామన్న యింగిత జ్ఞానంకూడాలేదు. వాస్తవానికి తీవ్రవాదులంటే యితర హిందువులతో పాటు సిక్కులకుకూడా భయమే. అదీ మన పాలకుల నిర్వాకం" బి. ఆర్. చో ప్రా చెప్పిన విష యాలు నేడు ప్రజలందరిలో ఉన్న భావాలే.

లాంగోవాలా-రాజీవ్ ఒప్పందం అమలుకోసం కమీషన్ల తరువాత కమీషన్లను నియమిస్తున్నారు. పని మాత్రం జరగటం లేదు. ఈ ఒప్పం దంలో ప్రధానమైన అంశం చండీగఢ్ బదలాయింపు.

**చండీగఢ్ ఎవరిది?**

దేశవిభజన సమయంలో* రాడ్‌క్లిఫ్ అవార్డు కారణంగా లాహోర్ పాకిస్థాన్‌కు కేటాయించబడింది. ఆనాటి మన నాయకుల అలసత్వం అందుకు

* రాడ్‌క్లిఫ్ ప్రముఖ ఆంగ్ల న్యాయవాది, మౌంట్ బాటెన్ మిత్రుడు దేశవిభజన విషయంలో తనకు సహాయపడమని రాడ్‌క్లిఫ్‌ను ఆఖరి వైస్రాయి కోరటం జరిగింది. అయితే రాడ్‌క్లిఫ్‌కు భారతదేశం గురించి ఏమీ తెలియదు. తూర్పు, పశ్చిమపంజాబ్‌ల మధ్య విభజన రేఖను నిర్ణయించే విషయంలో మన దేశాభిప్రాయాలను రాడ్‌క్లిఫ్ ముందు ఉంచిన న్యాయవేత్త మెహర్‌చంద్ మహాజన్.

ముఖ్యకారణం. లాహోర్ పంజాబ్ ప్రజల వ్యక్తిత్వానికి అనుగుణమైన నగరం. అయితే మనం దానిని పోగొట్టుకున్నాం. లాహోరు జనాభాలో అత్యధిక సంఖ్యాకులు ముస్లింలే అయినప్పటికీ, ముస్లిమేతరల ఆస్తులు, పెట్టుబడులు అధికంగా ఉన్నాయి గనుక లాహోరు నగరం భారతదేశానికే లభిస్తుందని మహజన్ అభిప్రాయం-అందువలన చివరిక్షణందాకా మరొక రాజధానికోసం ఎట్టి ప్రయత్నం జరుగలేదు. 1947 ఆగస్టునెలలో ప్రభుత్వం కళ్ళుతెరచింది. ఒకవైపు అరాచకత్వం, మరొకవైపు పాకిస్థానీ దుండగీడుల మారణహోమం జరుగుతుండగా రాజధానిని ఒక పాఠశాలకు అచ్చటి నుండి సిమ్లాకు మార్చారు. సిమ్లా రాజధానిగా అనువైన స్థలం కాదు కాబట్టి వేరే చోటికి రాజధానిని మార్చాలని అందరూఅభిప్రాయపడ్డారు అయితేఉన్న పట్టణాల లోనే ఏదోఒక పట్టణాన్ని రాజధానిగా ఎంచుకోవాలని అందరూ భావిస్తే జవహార్‌లాల్ నెహ్రూ మాత్రం నూతన నగరాన్ని నిర్మించాలని సూచించి, అమెరికాకు చెందిన *మెయర్స్ సలహామేరకు శివాలిక్ పర్వత పాద ప్రాంతాన్ని అందుకు అనువైన స్థలంగా నిర్ణయించారు. నూతననగర రూపకల్పన చేయటానికి ఫ్రెంచి వాస్తుశాస్త్ర నిపుణుడు కార్‌బూజియర్‌ను ఆహ్వానించారు. అంతవరకు నగరాలకు కల్పన చేయకపోయినా, భవన నిర్మాతగా మాత్రమే పేరున్న కార్ బూజియర్ చండీగఢ్‌ను రూపొందించాడు. ఈ నగరం పూర్తిగా హిందూ వాస్తు శిల్పరీతుల కనుగుణంగా నిర్మించ బడిందని చెప్పలేము. అలాగే అత్యాధునిక మైంది కాబట్టి ఎటువంటి లోటుపాట్లు లేవనీ చెప్పలేము. మొత్తంమీద అదొక ఆధునికనగరం.

పంజాబ్, హర్యానా, హిమాచల్ ప్రదేశ్ రాష్ట్రాల ఏర్పాటు తరువాత సరిహద్దు వివాదాలు ప్రారంభమయ్యాయి. ఈ వివాదాలను తీర్చటా

---

* మెయర్స్ నగర నిర్మాతగా ప్రఖ్యాతి చెందినవాడు.

నికి షా కమీషన్ ఏర్పడింది. నూతన రాష్ట్రాల సరిహద్దులను కష్టపడి నిర్దే శించినా చండీగఢ్ విషయంలో మాత్రం యిబ్బందులు ప్రారంభమయ్యాయి. పంజాబ్ అటవీవనరులను నదీ పరివాహక ప్రాంతాలను, కొండ ప్రాంతాల లోని అందమైన యాత్రాస్థలాలను కోల్పోయింది కాబట్టి చండీగఢ్ పంజా బ్‌కు దక్కితే బాగుంటుందని కొందరు భావించారు. చండీగఢ్ నిర్మాణ సమయంలో యితర ప్రాంతాలనుండి హిందీ మాట్లాడే వారు వచ్చి, నిర్మాణ సమయంలో అనేక కార్యక్రమాలలో పాల్గొని చివరికి అక్కడే స్థిరపడ్డారు. శ్రీమతి గాంధీ మాత్రం మూడు రాష్ట్రాలకు—పంజాబ్, హర్యానా, హిమా చల్ ప్రదేశ్‌లకు—ఒకే గవర్నర్, ఒకే హైకోర్టు, ఒకేపబ్లిక్ సర్వీస్ కమీ షన్ ఉండాలని భావించారు. చండీగఢ్‌ను కేంద్రపాలిత ప్రాంతంగానే ఉంచుతూ మూడు రాష్ట్రాలవారు వాడుకోవచ్చు అనుకున్నారు. లాహోర్‌లో ఇల్లూవాకిలీ వదలి వచ్చిన వారికోసం చండీగఢ్ నిర్మించారని అందువలన అది పంజాబ్‌కు దక్కాలని భావించేవారూ ఉన్నారు. హర్యానా ప్రజలు ఎక్కువగా ఢిల్లీతో సంబంధాలు పెంచుకున్నవారు. హిమాచల్ ప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉన్న పార్మర్, ఒకేగవర్నర్, ఒకే హైకోర్ట్, ఒకేరాజధాని పద్ధతికి వ్యతిరేకి. ఢిల్లీలో తనకున్న పలుకుబడి నుపయోగించి తమ రాష్ట్రా నికి వేరే రాజధానిగా సిమ్లాను ఏర్పరచుకో గలిగారు. అలా చండీగఢ్‌పై పంజాబీల కోరికలు పెరిగాయి. తమ కోరికలను సాఫల్యం చేసుకొనటానికి ఉద్యమాన్ని ప్రారంభించారు. సంత్ ఫతేసింగ్ ఈ ఉద్యమానికి నాయ కత్వం వహించారు.

కాంగ్రెస్ పక్షానికి చెందినవారు కూడ ఈ ఉద్యమానికి చేయూత నిచ్చారు. కాంగ్రెస్ వాది స్వాతంత్ర్య యోధుడు ఫెరుమాన్ నిరాహారదీక్ష బూని ఆత్మార్పణం చేసుకొనటం జరిగింది. ఆ తరువాత అకాలీలు అధికారం లోకి వచ్చినప్పుడు కాంగ్రెసువారు ఫెరుమాన్ ఆత్మార్పణాన్ని పదేపదే

ఉదహరించి ప్రజలను రెచ్చగొట్టసాగారు. వారి వత్తిడి తట్టుకోటానికై సంత్ ఫతేసింగ్ కూడ నిరాహారదీక్ష ప్రారంభించి ఆత్మాహుతి చేసుకుంటా నని బెదిరించటం జరిగింది అప్పుడు కేంద్రమంత్రిగా ఉన్న బాబూ జగజ్జీవన్‌రామ్ ఒక సూత్రాన్ని రూపొందించటం జరిగింది. ఆయన చండీగఢ్ బదిలీకి అదొహర్, ఫజిల్కాలకు ముడిపెట్టారు. ఆనాడు అకాలీదళ్ ఆయన ప్రతిపాదనలను ఆమోదించింది. అవి వెంటనే అమలు పరచినట్లయితే గొడవే ఉండేదికాదు. ఆ తరువాత ఎమర్జన్సీ వచ్చింది. అప్పుడు కేంద్రప్రభుత్వం తీసుకునే చర్యలకు అడ్డంకేలేదు. అయినా పని జరుగలేదు.

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంనుండి, ఆంధ్ర ఏర్పడినప్పుడు, మద్రాసు నగరాన్ని తమిళనాడుకు ఇచ్చినా, ఆంధ్రకు ఎటువంటి నష్టపరిహారం యివ్వ లేదు. అలాగే ఉమ్మడి బొంబాయి రాష్ట్రమును విభజించి. మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రాలు ఏర్పాటుచేసినప్పుడు బొంబాయి నగరాన్ని మహారాష్ట్రకు కేటాయించినప్పుడు గుజరాత్ రాష్ట్రానికి నష్టపరిహారం యివ్వలేదు. అలాగే అస్సాం రాజధాని షిల్లాంగ్‌నుండి మారినప్పుడు ఆ రాష్ట్రానికి నష్ట పరిహారం యివ్వలేదు. అయితే యిప్పుడు హర్యానాకు నష్టపరిహారం యివ్వాలని సూచించబడింది. దానితో సమస్య జటిలమైంది.

ఒక సమయంలో చండీగఢ్‌ను విభజించి హర్యానా, పంజాబ్ రాష్ట్రాలకు యివ్వాలనుకున్నారు. ఆ రాష్ట్రాలవారు కూడ విభజనను సమర్థించారు. కాని కేంద్రం అందుకు అంగీకరించలేదు. అందమయిన నగరాన్ని విభజించటమేమిటని ప్రశ్నించారు. వాస్తవానికి నగర విభజన అంటే నగరాన్ని ముక్కలు ముక్కలుగా చేయటం కాదు కదా!

రాజీవ్-లాంగోవాలా చేసుకున్న ఒప్పందంప్రకారం చండీగఢ్ బదులు హర్యానాకు కొన్ని హిందీ ప్రాంతాలను యివ్వాలి. అయితే ఈ ఒప్పందం

భాషాపరమైన విషబీజాలను నాటింది. పంజాబ్ రాష్ట్రంలో హిందీభాష మాట్లాడే ప్రాంతాలేవి అనే సమస్య తేలటం కష్టమవుతోంది. ఒప్పందంలోని పదజాలం బాధాకరంగా తయారవుతోంది. ఆ పదజాలం కారణంగానే అనేక న్యాయమూర్తులు పటిష్టమైన సూచనలు చేయలేకపోతున్నారు. మొదట నియమించబడిన మాథ్యూ కమీషన్ కలిసి ఉండిన భూమి (Contiguous territous) లేనందున, ఖందూఖేరా గ్రామం ఉన్నందున, అదొహర్, ఫజిల్కా ప్రాంతాలను బదిలీచేయటం సాధ్యంకాదంటే వెంక ట్రామయ్య కమీషన్ చండీగఢ్ బదులు 70 వేల ఎకరాల భూమిని యివ్వాలని సూచించారు. ఈ సూచనను పంజాబ్‌రాష్ట్ర ప్రభుత్వం ఆమోదించలేదు.

రాజకీయ సమస్యలు-వేర్పాటు వాదం

అకాలీదళ్‌లో బాదల్, తోహ్రాల నాయకత్వంలో చీలిక వచ్చింది. బర్నాలాకు అది ఒక సమస్య అయింది. ఆ కారణంగానే బర్నాలా వెంక ట్రామయ్య కమీషన్ సిఫారసులను ఆమోదించటంలేదు. చండీగఢ్‌ను ముందు పంజాబ్‌కు అప్పగించి, రాజకీయంగా ప్రశాంత వాతావరణం ఏర్పడిన తరువాత హిందీభాష మాట్లాడే ప్రాంతాలను నిర్ణయించవచ్చు. కేంద్రం, హర్యానా మొండిపట్టుదల పట్టవలసిన అవసరం లేదు. లేకపోతే చండీగఢ్‌ను ఏదో ఒక నిష్పత్తిలో విభజించి రాజధానులను ఏర్పరచుకోమన వచ్చు. అసలు చండీగఢ్ ఈ మధ్యనే నిర్మించబడిన నగరం కాబట్టి పంజాబ్, హర్యానాల చారిత్రక, సాంస్కృతిక విషయాలతో ఆ నగరానికి పెద్ద సంబంధమేమీ లేదు. అందువలన పంజాబ్, హర్యానాలు రెండూ క్రొత్త నగరాలను నిర్మించుకుని రాజధానులను ఏర్పరచుకోవచ్చు. అందు వలన ఉద్యోగావకాశాలు పెరుగుతాయి. ఏ విధంగా సమస్య పరిష్కారం కావాలన్నా రాజకీయవాదులు తమ స్వార్థాన్ని వదులుకోవాలి. అలా

స్వార్థాన్ని వదలుకున్ననాడు నదీజలాల సమస్యకూడ సమంజసంగానే పరిష్కారమవుతుంది. అమృతసర్ నగరాన్ని పవిత్ర నగరంగా ప్రకటించి అచట మత్తుపదార్థాలను పొగాకుతో తయారయిన వస్తువులను అమ్మకుండా నిషేధించటం కూడ అంతపెద్ద సమస్యకాదు గురుద్వారా చట్టాన్ని మార్చు కోవచ్చు. గుర్బానీకీర్తన ప్రసారానికై సదుపాయమూ ఏర్పాటు చేసు కోవచ్చు. సమస్యలు వాస్తవానికి యివికావు ఆనాడు బ్రిటిష్‌వారు ప్రారం భించిన ఈ నాటకంలో ప్రతినాయకుడు (విలన్) స్వార్థ రాజకీయవాది. ఈనాటికీ అతనే నాటకాన్ని నడిపిస్తున్నాడు.

## పెరుగుతున్న తీవ్రవాదం

స్వార్థ రాజకీయాల కారణంగానే తీవ్రవాదం పెరిగిపోతుంది. రాను రాను తీవ్రవాదులు సానుభూతిపరులు పెరుగుతున్నారు. ముఖ్యంగా సిక్కు యువకులలో తీవ్రవాద సానుభూతి పెరుగుతోంది. పాలనావ్యవస్థ పోలీసు వ్యవస్థబలహీనమైనాయి. కొన్ని ప్రాంతాలలో పోలీసువారిలో తీవ్రవాదులు పెరుగుతున్నారు. ఈనాడు తీవ్రవాదం ఎన్నడూ లేనంత తీవ్రస్థాయికి చేసు కుంది. ఈ తీవ్రతకు భయపడి యితర హిందువులకు పెద్ద ఎత్తున రాష్ట్రాన్ని వదలిపెట్టి బయటికి వెళ్ళిపోటానికి సిద్ధంగా ఉన్నారు. యిలా కాందిశీకులై యితర ప్రాంతాలకు తరలివెళ్ళటం అసలు ప్రారంభమైందనే చెప్పాలి.

అమృత్‌సర్, గురుదాస్‌పూర్, ఫెరోజ్‌పూర్, కపుర్తల జిల్లాలలో పరిస్థితి భయానకంగా ఉంది. ఆ జిల్లాలు సరిహద్దు ప్రాంతాలలో ఉన్నాయి. అల్ప సంఖ్యాకులైన యితర హిందువులనే తమ హత్యాకాండకు గురిచేసి, వారిలో భయాన్ని సృష్టించి, వారు ఆ ప్రాంతాలనుంచి వెళ్ళిపోతే తమ ఖలిస్థాన్ ఉద్యమానికి బలం చేకూరుతుందని తీవ్రవాదుల అభి ప్రాయం. సంఘటనలు కూడ ఆలాగే కొనసాగుతున్నాయి. ముఖ్యంగా

గురుదాస్‌పూర్, అమృత్‌సర్ జిల్లాలలో ఈ పరిస్థితి కొనసాగుతోంది. కొంతమంది పంజాబ్‌లోనే భద్రత ఉన్న ప్రాంతాలకు వెళ్తున్నారు. ఒక లెక్క ప్రకారం 1986 జూన్ నెలాఖరుకు 452 కుటుంబాలు అమృసర్ జిల్లాను వదలిపెట్టాయి. అందులో 61 కుటుంబాలు తమ ఆస్తి పాస్తులను అయిన కాడికి తెగనమ్ముకున్నాయి కేంద్ర ప్రభుత్వ లెక్కల ప్రకారం 4,500 మంది రాష్ట్రాన్ని వదిలిపెట్టారు. పంజాబ్ రాష్ట్ర ప్రభుత్వ లెక్కల ప్రకారం 941 కుటుంబాలు ఈ రాష్ట్రాన్ని వదిలిపెట్టాయి. చాలా కుటుంబాలు రాష్ట్రంలోనే యితర జిల్లాలకు వెళ్లాలని చూస్తున్నాయి. అయితే కాంది శీకుల ధోరణిలో ప్రజల వలస స్పష్టంగా కనపడక పోవటానికి అనేక కారణాలున్నాయి. చిన్న వ్యాపారస్తులు, చిన్న ఉద్యోగస్తులు తమ జీవనాధారాన్ని వదలుకుని వెళ్ళలేరు కదా! వీరిలో కొంత మందికి సిక్కు రైతాంగంతో మంచి సంబంధాలు కూడ ఉన్నాయి. కొంతమంది సిక్కు సంప్రదాయం నుండి సనాతన ధర్మానికి, సనాతన ధర్మం నుండి సిక్కు సంప్రదాయానికి తరచుగా మారుతూనే ఉంటారు. అలాగే వీరిద్దరి మధ్య యిచ్చి పుచ్చుకోవటాలు కూడ ఉన్నాయి. అయితే యిప్పుడు ఆ సంబంధాలు దెబ్బ తింటున్నాయి. ఈ పరిస్థితిని మెరుగు పరచాలంటే తీవ్ర వాదులపై కఠిన చర్యలు తీసుకోవాలి. 1986 మే నెల తరువాత పారా మిలిటరీ దళాలను సరిహద్దు జిల్లాలలో ఉపయోగిస్తున్నారు.

అక్టోబరు 1985 నుండి జూన్ 1986 వరకు 567 మంది తీవ్ర వాదులను అరెస్టు చేసారుట, 37 మంది చనిపోయారు. ప్రస్తుతం పంజాబ్ పోలీసు డైరెక్టర్ జనరల్ అయిన రిబీరో కథనం ప్రకారం మూడు వేల నుండి నాలుగు వేల వరకు తీవ్ర వాదులు ఉన్నారు. వారిలో దాదాపుగా 500 మంది క్రియా శీలక సభ్యులు. తీవ్రవాదులలో 30 నుండి 40 వరకు వివిధ వర్గాలు ఉన్నాయి. తీవ్ర వాదులలో వెయ్యి మందికి పైగా నాటు

బాంబులతో, తుపాకులతో తిరుగుతుంటే, వందమంది దగ్గర అత్యంత ఆధునికమైన ఆయుధాలున్నాయి. అయితే ఎక్కువమంది తీవ్రవాదులు సలహాదారులుగానో, సమాచారాన్ని చేరవేసే వారుగానో, రాజకీయ వాదులు గానో ఉన్నారు. ఈ తీవ్రవాదులలో నక్సలైట్లు కూడ చేరటంతో వారి వ్యవస్థ కొంత వీరిలో కనపడుతుంది. తీవ్రవాదుల సానుభూతి పరులు 60 వేల దాకా ఉండవచ్చు.

1986 లో తీవ్రవాదం పెరగటానికి ముఖ్య కారణంగా బర్నాలా ప్రభుత్వం విచక్షణా రహితంగా తాము అధికారంలోకి రాగానే వెంకువేం మంది తీవ్రవాదులను విడుదల చేయటాన్నే చాలా మంది పేర్కొంటున్నారు. బర్నాలా ప్రభుత్వం మాత్రం అలా విడుదల చేయబడిన వారిలో చాలా తక్కువ మంది ఈనాటి హింసా కాండకు కారణమని వాదిస్తోంది. భారత-పాక్ సరిహద్దును పూర్తిగా మూసివేయక పోవటం కూడ ఒక కారణమని బర్నాలా ప్రభుత్వంతో పాటు మరికొందరంటున్నారు. పాకిస్తాన్‌లో ప్రముఖ రాజకీయ పక్షమైన పీపుల్స్ పార్టీ అధ్యక్షురాలు బేనజీర్ భుట్టో పంజాబ్ తీవ్రవాదులకు పాకిస్తాన్‌లో శిక్షణ ఇవ్వబడుతోందని స్పష్టంగా పేర్కొంది. దీనికి తోడు పంజాబ్‌లో హత్యలు చేసి పాకిస్తాన్‌లో దాక్కోటానికి అవకాశం దొరుకుతోంది. పాకిస్తాన్ సైనికులు సిక్కు వేషాలు ధరించి పంజాబ్‌లో తీవ్రవాదులకు సహాయ పడటం కూడ జరుగుతోంది. విదేశాలనుంచి ధనం, ఆయుధాలు రావటానికి ఈ సరిహద్దు ఉపయోగ పడుతోంది. అందువలన సరిహద్దులో గట్టి నిఘా ఉంచాలని అందరూ కోరుతున్నారు.

రాష్ట్రీ అకాలీదళ్ రాజకీయాల కారణంగా తీవ్రవాదులు పేట్రేగి పోతున్నారు అయితే గత కొద్ది వారాలుగా పోలీసులకి ఏకాల

4)

కారణంగా వారి ఆటలు కొద్దిగా కట్టుబడ్డాయి. పట్టణాల నుండి, గురు ద్వారాల నుండి పల్లెలకు మరలి సానుభూతిపరుల గృహాలలో ఆహారం నివాసం ఏర్పరచుకుంటున్నారు. పోలీసుల పరికరాలను పూర్తిగా మార్చటానికి ప్రయత్నిస్తున్నారు. 1986 మే, జూన్ నెలల్లో రంజిత్‌సింగ్‌బాబా, గుర్మేజ్‌సింగ్‌గేజా, మఖన్‌సింగ్‌చిట్, దక్షీర్‌సింగ్ బిల్లా వంటి తీవ్రవాదులను వారి అనుయాయూలను తుదముట్టించటం జరిగింది. అలాగే మరికొంత మందిని అరెస్టు చేసారు అకాలీదళ్ నాయకత్వం కూడ మొదటిసారిగా తీవ్రవాదాన్ని నిర్మూలిస్తామంటూ ప్రకటించారు. అయితే పోలీసు దళాలు అమాయకులైన సిక్కులను బాధలు పెడ్తున్నారన్న వాదన రాజకీయ వాదుల నుండి వినపడ్తోంది. అలా వాదించే రాజకీయ వాదులు అమృత్‌సర్, గురుదాస్‌పూర్ జిల్లాలకు చెందినవారే. ఆపరేషన్ బ్లూస్టార్‌లో చనిపోయిన సిక్కులు ఎక్కువ మంది ఈ జిల్లాలకు చెందినవారే. 1984 లో అక్టోబరు 31, నవంబరు 1,2 తేదీలలో ఢిల్లీ మరికొన్ని పట్టణాలలో జరిగిన హింసాకాండ కూడ సిక్కుల మనస్సులలో యింకా ఉంది. పంజాబ్ రాష్ట్ర ప్రభుత్వం తీవ్రవాదుల మీద చర్య తీసుకోనట్లే, కేంద్ర ప్రభుత్వం కూడ దాదాపు రెండు సంవత్సరాలు అవుతున్న ఢిల్లీ హింసాకాండపై ఎట్టి చర్యా తీసుకోలేదు.

ప్రతిక్రియాత్మక హింస మళ్ళీ హింసకే దారితీస్తుంది. శివసేన, హిందు సురక్షా సమితి మొదలైన సంస్థలు తమ చర్యల ద్వారా అటువంటి వాతావరణాన్నే సృష్టిస్తున్నాయి. రాష్ట్రంలో శాంతిభద్రతలు క్షీణించటానికి కారణమవుతున్నాయి. అమాయకులైన యితర హిందూ సోదరుని హత్య చేస్తే దానికి సమాధానంగా మరొకరిని.... యిలా హింసా కొనసాగుతూ ఉంటుంది. ఈ ప్రతి క్రియాత్మక హింసకు యితర హిందూ యువకులను పాక్ ఏజెంట్లు ప్రేరేపిస్తున్నట్లు అర్థమవుతుంది. శివసేన ఆవిర్భావం

పంజాబ్ సమస్యను మరింత జటిలం చేసింది. పంజాబ్ రాష్ట్ర ఆర్థిక పరిస్థితి కూడ ఈ మధ్య దిగజారిపోయింది. జీవన ప్రమాణం తగ్గిపోతోంది. పంజాబ్ రాష్ట్రం ఈనాడు గందరగోళ పరిస్థితిలో ఉంది. అకాలీదళ్ అధికారంలో ఎంత కాలం కొనసాగుతుందో చెప్పలేము. అధికారం కోసం ప్రాకులాడే వారి సంఖ్య పెరుగుతోంది. ఆ ప్రాకులాటలో తమకు ఏది లాభమని తోస్తే అదే చేస్తున్నారు. అకాలీదళ్‌లో ఐక్యతను సాధించటానికై ఎవ్వరూ చేయగలిగింది ఏమిలేదు.

## ఖలిస్తాన్ కోట విచ్ఛిన్నం

1986 జులై 18, 19 తేదీలలో పోలీసు - పారా మిలిటరీ దళాలు ఖలిస్థాన్ రాజధానిగా చెప్పబడుతున్న 'మాండ్' ప్రాంతంపై దాడిచేసి 65 మందికి పైగా తీవ్రవాదులను అరెస్టు చేసారు. రెండు వేల మందికిపైగా భద్రతాదళంవారు అమృత్‌సర్, కపూర్తలా, ఫిరోజ్‌పూర్ జిల్లాలలో హెలికాప్టర్లను, మోటారు బోట్లను, బుల్‌డోజర్లను, ట్రాక్టర్లను ఉపయోగించి తీవ్రవాదులను, వారి ఆయుధాలను పట్టుకున్నారు. అవతార్‌సింగ్ బ్రహ్మపూర అనే పేరుగల తీవ్రవాది తత్‌ఖల్సా పేరుతో నడుపుతున్న తీవ్రవాది వర్గాన్ని ఈ దాడిలో పట్టుకున్నారు. ముండపి, కర్మువాలా గ్రామాల మధ్య ఈ దాడి కేంద్రీకృతమైంది ఇదే సమయంలో ఇతర ప్రాంతాలలో కూడ దాడి జరిపి మరో 33 మంది తీవ్రవాదులను పట్టుకున్నారు.

## పోలీసుల కర్తవ్యం

అకాలీదళ్ రాజకీయాల కారణంగా అసమ్మతి వర్గం బర్నాలాపై ఎక్కువ వత్తిడి తీసుకురావటానికి ప్రయత్నించవచ్చు. తీవ్రవాదుల సానుభూతిపరులు కూడ బర్నాలాను అధికారం నుండి తొలగించటానికో, లేక అధికారాన్ని తగ్గించటానికో ప్రయత్నిస్తున్నారు. పోలీసులు అమాయకులను

హింసిస్తున్నారని వారు వాదన ప్రారంభించారు. 1986 జూన్ 28 వ తేదీ తరన్, తరన్ గురుద్వారవద్ద హర్‌భజన్‌సింగ్ అనే రాగిని పోలీసులు అన్యాయంగా చంపివేసారన్నది వారు యిస్తున్న ఒక ఉదాహరణ దీనిమీద పంజాబ్ మంత్రివర్గం కూడ సమావేశమై చర్చించింది. అకాలీదళ్ పార్టీ తరపున విషయ సేకరణకై ఒక సంఘాన్ని నియమించారు పోలీసు డైరెక్టర్ జనరల్ రిబేరోను కూడ ఒక నివేదికను సమర్పించమన్నారు హర్ భజన్‌సింగ్ యిల్లు జౌరా గ్రామంలో ఉంది. చాలామంది రాగి బాధ్యతను నిర్వహిస్తున్నవారు తీవ్రవాదులకు సానుభూతి పరులే పోలీసులు గుర్బచన్ సింగ్ మనోచాహల్ అనే పేరున్న తీవ్రవాదిని పట్టుకోటానికి జౌరా వెళ్లారు. అతను హర్‌భజన్‌సింగ్ యింట్లో దాక్కొని ఉన్నాడు. అందువలన పోలీసులు అతని యింటిపై దాడిచేయగా అతను చనిపోయాడు హర్‌భజన్ సింగ్‌వద్ద .22 పిస్టల్, 303, .455 తూటాలు దొరికాయని పోలీసు కథనం. అకాలీదళ్ నియమించిన సంఘం సమర్పించిన నివేదిక యిందుకు విరుద్ధంగా ఉంది. అందుకనే బర్నాలా ఈ విషయాన్ని సి.బి ఐ విచారణకు వదులుతున్నామన్నారు. హర్‌భజన్‌సింగ్ యొక్క తల్లి, భార్య ఆపరేషన్ బ్లూస్టార్‌లో చనిపోయారు. తాను చనిపోవటానికి రెండు రోజులకు ముందే హర్‌భజన్‌సింగ్ తిరిగి వివాహం చేసుకున్నాడు. యింతకీ అతను తీవ్ర వాదా ? అతని గత చరిత్ర తీవ్రవాదిగా అతను మారటానికే ఎక్కువ అవకాశాలున్నాయని సూచిస్తోంది. అయితే ఆ గ్రామ ప్రజలు మాత్రం హర్‌భజన్‌సింగ్ అమాయకుడనే నమ్ముతున్నారు.

తీవ్రవాదులను నిర్మూలించటం కంటే, ప్రజా హృదయం చూరగొనటం అత్యంతావశ్యకం, లేకపోతే పాత తీవ్రవాదుల బదులు కొత్త తీవ్రవాదులు తయారవుతారు. సిక్కు సంప్రదాయానికి చెందని వారంతా తీవ్రవాదులను త్వరగా నిర్మూలించమని కోరుతున్నారు, సిక్కుల

కోర్కెలను జాతీయ రాజకీయ జీవనంతో కలుపుకు పోవటం మరీ కష్టమైన విషయం. అమాయకులైన వారిని హింసించినందుకు బహిరంగ క్షమాపణలు, అరెస్టు అయిన వారిని విడుదల చేయటం, సైన్యాన్ని ఉద్రేకపూరిత వాతవరణంలో వదలివెళ్లిన వారిని తిరిగి చేర్చుకొనటం వగైరా కోర్కెలతో పాటు ఖలిస్థాన్ నిర్మిస్తామనటం, యితర హిందువులను భయపెట్టటం జరుగుతూనే ఉంది. ఈ మధ్య మరొక సూచన వినపడ్తోంది. రాజీవ్ - లాంగోవాలా ల మధ్య ఏర్పాటు చేసుకున్న ఒప్పందాన్ని రద్దు చేసుకుని, తీవ్రవాదులతో అంటే బాబా జోగిందర్ సింగ్ ఆధిపత్యంలో ఉన్న యునైటెడ్ అకాలీదళ్‌తో, అఖిల భారత సిక్కు విద్యార్థి సమాఖ్య - దమ్‌ దమి తక్సల్ నాయకులతో చర్చలు జరిపి ఒప్పందం చేసుకోవాలని ఆ సలహా.

మన ముందున్న ప్రమాదం :

ఈనాడు పంజాబ్ సమస్యను పరిష్కరించకపోతే భవిష్యత్ భారతదేశం మనల్ని క్షమించదు. 1947 సంవత్సరానికి పూర్వం స్వాతంత్రోద్యమంలో పాల్గొన్న వారు సమయోచితంగా, దేశశ్రేయస్సును దృష్టిలో పెట్టుకుని వ్యవహరించనందునే దేశ విభజన అనే విషాద సంఘటన జరిగిందని మనం భావిస్తున్నాం. తిరిగి అటువంటి ప్రమాద మేర్పడకూడదు.

పంజాబ్ సమస్యకు పరిష్కారాన్ని కనుగొన వలసిన బాధ్యత అకాలీదళ్ వారిదో, కేంద్ర ప్రభుత్వానిదో మాత్రం కాదు. ఆ బాధ్యత భారతీయులందరిదీను. 80 సంవత్సరాల క్రితం బెంగాల్ విభజనను జాతి యావత్తూ వ్యతిరేకించిన వైనం మనం గుర్తు తెచ్చుకుంటే మంచిది. ఆనాడు వందేమాతరం నినాదం అందరికీ స్ఫూర్తి నిచ్చింది కులమత తేడాలు అడ్డం రాలేదు ఈనాడు కూడ అలా శ్రమించాలి.

పాణిని, పతంజలి, చాణుక్యుడు వంటి మేధావులు తమ మేధా సంపత్తిని యితరులకు పంచిపెట్టిన ప్రాంతమది. పంజాబ్ కేసరి లాలా లజపతిరాయి, అమరవీరుడు భగత్‌సింగ్ భారత స్వాతంత్ర్యానికై అహ రహమూ కృషి చేసిన ప్రాంతమది. ఆ ప్రాంతాన్ని సంరక్షించుకోవలసిన బాధ్యత మనందరిదీను.

పులి మీద స్వారీ చేయటం తేలికే. కాని క్రిందకి దిగే పని లేదు. పులి మీద నుండి దిగితే పులి మననే తినవచ్చు. బాదల్, తోహ్రా పులి మీద స్వారీచేయటానికి కుతూహల పడ్తున్నట్లు అనిపిస్తోంది

ఆపరేషన్ బ్లూ స్టార్ తరువాత అకాల్‌తక్త్ పునర్నిర్మాణం జరిగింది. కాని ప్రజలలో ఉద్రేకాలను రెచ్చగొట్టి తమ వైపుకు తిప్పుకోవాలని ఆలో చించే వారు అకాల్‌తక్త్‌ను తిరిగి పడగొట్టి కర్‌సేవ ద్వారా దానిని నిర్మిస్తా మని తలపోయటమే మూర్ఖత్వం. ఆ విషయాన్ని వారు గ్రహించి ఉండాలి.

## ఇప్పుడు మనమేమి చేయాలి ?

ఈ దేశంలో జన్మించిన ప్రతియొక్కరూ జాతీయ సమైక్యత, సమ గ్రతలను కాపాడటం తమ ప్రథమ కర్తవ్యంగా భావించాలి. నేటి పంజాబ్ సమస్య సిక్కులకు యితర హిందువులకు మధ్య సమస్య కాదు. జాతీయ శక్తులకు తీవ్రవాదులకు మధ్య జరుగుతున్న యుద్ధంగా దానిని మనం అర్థం చేసుకోవాలి. ఈ సమస్య కారణంగా పంజాబ్‌లోనే కాక యావత్ భారత దేశంలో శాశ్వతంగా కలిసి జీవించవలసిన సిక్కులకు యితర హిందువు లకు మధ్య ఎటువంటి మనస్పర్థలూ పొడసూపకూడదు. సిక్కులు ఇతర హిందువులు కలిసి ప్రయత్నించటం ద్వారానే మనం పంజాబ్ సమస్యను పరిష్కరించగలం. వాస్తవానికి సిక్కులందరూ తీవ్రవాదులు కారు. సిక్కులందరూ దేశవిభజనను కోరటం లేదు భయంవల్ల తీవ్రవాదాన్ని వ్యతిరేకించలేకపోతున్నారు. అందువలన సామాన్య ప్రజానీకంలో మనం ధైర్యాన్ని నింపాలి తీవ్రవాదానికి వ్యతిరేకంగా ఉమ్మడి పోరాటాన్ని కొన

సాగించాలి. రాజకీయ పక్షాలన్నీ కలిసి పరిష్కారం కొరకు బుద్ధిపూర్వక మైన బాధ్యతను స్వీకరించాలి. పంజాబ్ సమస్యను అధిగమించాలనే ఆవేదన ప్రజలలో స్పష్టంగా కనపడుతోంది.

సిక్కులను యితర హిందువులకు మధ్య సంబంధ బాంధవ్యాలను పెంచటానికి ప్రయత్నించాలి. వారి మధ్య వివాహాలను ప్రోత్సహించాలి రాజకీయ పక్షాలు వీరిరువురకు కలిపి సాంఘిక రాజకీయ కార్యక్రమాలను నిర్వహించాలి. మతమౌఢ్యాన్ని రాజకీయాలకు దూరంగా ఉంచాలి.

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు సంయుక్తంగా తీవ్రవాదులను అణచి వేయాలి. తీవ్రవాదులకు వ్యతిరేకంగా ప్రజాసమీకరణ చేయాలి. అందు కోసం రాజకీయ పక్షాలతో పాటు సామాజిక సంస్థలు కూడ పనిచేయాలి. సరిహద్దు ప్రాంతాలనుంచి వలస పోయే వారికి నచ్చ చెప్పి వలసను ఆపాలి. వలసకు కారణమైన పరిస్థితులను చక్క దిద్దటానికి ప్రయత్నించాలి. పలుకుబడి గల వ్యక్తులు పంజాబ్ సమస్యను పరిష్కారాన్ని వివరిస్తూ దేశమంతటా పర్యటించాలి. యువకులకు, విద్యార్థులకు ఈ సమస్య అర్థమయ్యేటట్లు వివరించి, వారు సిక్కులకు యితర హిందువులకు మధ్య సుహృద్భావాన్ని పెంచేటట్లు చూడాలి. సమస్య అవగాహనకై సాహిత్యాన్ని ప్రచురించాలి జాతీయ సమైక్యత విషయంలో భిన్నాభిప్రాయాలుండవు, ఉండకూడదు అవసరమైతే జాతీయ సమైక్యతకోసం భద్రతకోసం ఎటువంటి త్యాగానైనా చేయటానికి అందరూ సంసిద్ధులు కావాలి మొదట రాజకీయ నాయకులు తమ పదవీకాంక్షను త్యాగం చేయాలి.

మనం దేశం కోసం జీవిద్దాం.  
దేశ సంరక్షణ మన బాధ్యత.  
దేశ సమైక్యత మన లక్ష్యం.

# అనుబంధం - 1

[ రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ అఖిల భారత కార్యకారిణి మండలి సమావేశాలు 1986 జులై 11, 12 తేదీలలో భోపాల్ లో జరిగి నప్పుడు పంజాబ్ సమస్య పై ఆమోదించిన తీర్మానం ]

**పంజాబ్ సమస్య - మన తక్షణ కర్తవ్యం :**

పంజాబ్‌లో రోజు రోజుకూ క్షీణిస్తున్న పరిస్థితి దేశ శ్రేయస్సుకోరే వారి కందరికీ చాలా ఆందోళన కలిగిస్తోంది. రాష్ట్ర ప్రభుత్వం అనేక ప్రకటనలు, హామీలు యిస్తున్నప్పటికీ తీవ్రవాదులు అమాయకులపై దాడి చేయడం, చంపడంలాంటి వార్తలు లేని రోజు ఒక్క రోజుకూడా వుండటం లేదు పెద్ద ఎత్తున సరిహద్దు భద్రతాదళాలను రిజర్వ్ దళాలను నియమించి నప్పటికీ పరిస్థితి అదుపులోకి రాలేదు. ఈ పరిస్థితి ఉత్పన్నమవడానికి కారణం స్పష్టంగానే కనిపిస్తున్నది. 'ఖలిస్తాన్' పట్ల సానుభూతి చూపిస్తున్న వారికి అన్నిరకాల సహాయ సహకారాలు అందిస్తున్న శక్తులు పంజాబ్ మంత్రివర్గంలోనూ, ప్రభుత్వ సిబ్బందిలోనూ, పోలీసులలోను వున్నాయి. ఇది యిలా వుండగా ఒక ప్రక్క అకాలీలలో అసంతృప్తి వర్గాల చర్యలు దేశ ద్రోహ శక్తుల ఆశలకు మరింత శక్తినిస్తున్నట్లే మరొక ప్రక్క అధికారంలోవున్న అకాలీలు తీవ్రవాదుల కార్యకలాపాలకు గురి అవుతున్న వారికి సహాయముచేసి రక్షణ కల్పించడములో జరుపుతున్న విచక్షణవల్ల నానాటికీ సిక్కేతర పంజాబీలు మానసిక స్థయిర్యాన్ని కోల్పోతున్నారు. తత్ఫలితంగా వారు పంజాబ్‌వదిలి పెద్ద ఎత్తున వలసపోతున్నారు. స్థానిక సిక్కులు కూడా తాము తీవ్రవాదుల ఆగ్రహానికి గురికావలసి వస్తుందనే భయంతో వలసపోతున్న వారికి సహాయాన్ని అందించడములో ముందుకు రావడానికి సందేహిస్తున్నారు దీనివల్ల దేశంలో వివిధ ప్రాంతాలల్లో

నివసిస్తున్న సిక్కు సోదరులు, అనేకమంది దృష్టిలో అనుమానాస్పదంగా తయారయ్యారు. ఈనాడు మన జాతి ఎదుర్కొంటున్న తీవ్రమయిన ప్రమాద స్థితియిది.

ఒకే సమాజంలో అంగాలైనటువంటి శిక్కులు, సిక్కేతర పంజాబీల మధ్య ఒకరి పట్ల వొకరికి అవిశ్వాసాన్ని, ద్వేషాన్ని కలిగించడానికి తీవ్ర వాదుల వేర్పాటువాదం ప్రయత్నిస్తున్నది. దేశ సమైక్యత దృష్ట్యా దీనిని వెంటనే అంతమొందించాలని అఖిల భారత కార్యకారిణిమండలి గట్టిగా అభి ప్రాయపడుతోంది. ఈలక్ష్య సాధనకు పంజాబ్ బయటనున్న సిక్కు సోదరులందరికీ రక్షణ కల్పించడానికి ముందుకురావల్సివుంది. అట్లే సిక్కు సోదరులు, తీవ్రవాదుల దేశ ద్రోహ కార్యకలాపాలను తీవ్రంగా ఖండిస్తూ పంజాబ్ ప్రభుత్వం పైన గట్టిఒత్తిడి తెచ్చేందుకు తాము ముందుకు రావాలి. ఆ విధంగా చేస్తే పంజాబ్ ప్రభుత్వం సిక్కేతర పంజాబీల ధన, ప్రాణా లను రక్షించడంలో తన విధిని నిర్వహించడానికి ఏ విధంగా సంకోచించదు. ఈ క్లిష్టపరిస్థితిలో ఉదాసీనంగావుంటే సిక్కేతరులలో దాగిఉన్న అను మానాలు మరింత పెరిగే అవకాశం వుంది. అందుచేత ప్రముఖవ్యక్తులు, సంస్థలు ఈ విషయాన్ని గట్టిగా ప్రకటించడంలో చొరవ తీసుకోవడాన్ని అఖిల భారత కార్యకారిణి మండలి హృదయపూర్వకంగా స్వాగతిస్తోంది.

పంజాబ్ ప్రభుత్వం ఎట్టిఆలస్యం చేయకుండా పరిపాలనా యంత్రాం గము లోనూ, పోలీస్ విభాగంలోనూ చాలాకాలం నుండి పాతుకొనిపోయిన అనుమానస్పదులను వెంటనే ఏరివేయాలనీ, అదే విధంగా బాధితులకు రక్షణ కల్పించడంలో తచ్చాడ కుండా, విచక్షణాపైఖరిని విడనాడాలని అఖిల భారత కార్యకారిణి మండలి పంజాబ్ ప్రభుత్వాన్ని గట్టిగా కోరుతున్నది అయితే పంజాబ్ ముఖ్యమంత్రి బర్నాలా పంజాబ్ నుండి వలసపోయినవారి నందరినీ తిరిగి రావలసిందిగా చేసిన విజ్ఞప్తి స్వాగతించ వలసినదయ్యే కానీ

అవే చాలదు. పంజాబ్‌లోనూ, ముఖ్యంగా మధ్యప్రాంతంలోనూ, అమృతసర్, గురుదాసపూర్ జిల్లాలలోనూ భద్రతకు తగిన వాతావరణం నిర్మాణం చేయనంతవరకు ఈ విజ్ఞప్తుల ప్రభావం ఉండదు. పైగా జైళ్ళ నుండి తీవ్రవాదుల విడుదల గురించి తరచుచేస్తున్న ప్రకటనలు తిరిగి వద్దామనుకుంటున్న వారిలో భయోత్పాతాన్ని కల్గించడమే గాక ప్రభుత్వపు నిజాయితీపట్ల సంశయాన్ని మరింత పెంచుతోంది. ఈ విషయంలో చాలాగట్టిగా ఆలోచించాలని కార్యకారిణిమండలి ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నది.

పంజాబ్‌లోని సిక్కేతర సోదరులందరూ వారి కొంపా గూడు వదలిపెట్టి పారిపోవాలనే ఆలోచనలకు తావివ్వక దేశద్రోహులైన తీవ్రవాదులను సాహసంతో ఎదుర్కొని తమను తాము రక్షించుకొనేందుకు సంసిద్ధులు కావాలని కార్యకారిణి మండలి ఆశిస్తోంది. పాశ్చాత్య శక్తులచేత ప్రేరేపింపబడుతూ, పాకిస్థాన్‌చేత శిక్షణ పొందుతున్న ఈ విచ్ఛిన్నకర శిక్కులను శిక్కు పంథ్ ఉద్ధారకులని భావించి వారి ఎత్తుగడలలో పడవద్దని కూడా కార్యకారిణి మండలి పంజాబ్‌లోని సిక్కు సోదరులకు విజ్ఞప్తి చేస్తోంది. ఈ దేశాన్ని ఖండించడానికి విదేశీహస్తాలలో కీలుబొమ్మలైన ఈ తీవ్రవాదులు దేశద్రోహులకంటే మరే విధంగానూ మెరుగు కాదు ఇట్టి దుష్టశక్తులను తుదముట్టించడానికి మన దేశ ప్రజలందరూ సమైక్యంగా కృషి చేయాలని ఈ రోజున మన దేశభక్తికి యిది ఒక పరీక్ష సమయమని, ప్రజలు ఈ విషయంలో వెనుకంజ వేయరనే దృఢ విశ్వాసాన్ని కార్యకారిణి మండలి ప్రకటించింది.

సరిహద్దు జిల్లాలకు రక్షణ కల్పించడంలో ఎట్టి సంకోచం లేకుండా అవసరమైన చర్యలన్నింటినీ వెంటనే తీసుకోవాలని కేంద్ర ప్రభుత్వాన్ని మండలి గట్టిగా కోరుతున్నది. అంతేగాకుండా పాకిస్థాన్ కుట్రకుతంత్రాలకు సాహసించకుండా వుండాలంటే ప్రభుత్వం తగిన రాజనీతిని ఉపయోగించాలని కూడా కోరింది.

ఈ హిందూ సమాజంలో అంగాలవంటి ఈ రెండు వర్గాల మధ్య తరాల నుండి వస్తున్న సాంస్కృతిక సంబంధాలను మరింత ధృడతరం చేయడంలో స్వయం సేవకులు అన్నివిధాల కృషి చేయాలని కార్యకారిణి మండలి కోరుతున్నది. అందుకోసమై గురువులిచ్చిన దివ్య సందేశాన్ని చరిత్రను వక్రీకరించే ప్రయత్నాలను పూర్తిగా వమ్ముచేస్తూ, పెద్ద పెట్టున ఒక ప్రచార ఉద్యమాన్ని చేపట్టి ఈ దేశమంతా తమ మాతృభూమిగా భావిస్తూ, ఈ దేశ స్వాతంత్ర్య సమగ్రతలను పరిరక్షించడమే తమ జీవన లక్ష్యంగా తీసుకొన్న గురువుల సందేశంలోని సత్యాన్ని అందరికీ అందించాలని కూడా ఈ మండలి కోరుతున్నది.

## అనుబంధం — 2

### తీవ్రవాద సంస్థలు

పంజాబ్‌లో ప్రముఖంగా ఉన్న తీవ్రవాద సంస్థలు ప్రజల్ని మభ్యపెట్టటంకోసం ఒక చారిత్రక సంస్థ పేరో లేక మరొక పవిత్రమైన పేరో పెట్టుకున్నాయి. ఇవి ఎప్పుడు ప్రారంభించినా 1981 నాటికి స్వర్ణదేవాలయ ఆవరణలోకి ప్రవేశించాయి. కొన్ని తీవ్రవాద సంస్థలు వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

### దళ్‌ఖాల్సా

నేడున్న దళ్‌ఖాల్సా, 1978 ఏప్రిల్ నెలలో అకాలీలకు నిరంకారీలకు మధ్య జరిగిన సంఘర్షణ తరువాత ప్రారంభమైంది. 1978 ఆగస్టు 6న చండీగడ్‌లో అకాల్‌గఢ్ గురుద్వారాలో తీవ్రవాదుల సమావేశమొకటి జరిగింది. ఆ సమావేశంలో అయిదుగురి నాయకత్వంలో దళ్‌ఖాల్సా ప్రారంభమైంది. జస్వంత్‌సింగ్ ఠేకేదార్, హర్సిమ్రాన్‌సింగ్, గజేంధర్‌సింగ్, సత్నామ్‌సింగ్, ఘర్‌భగత్‌సింగ్ నాఘాన్‌వాల్ ఆ అయిదు

గురు నాయకులు. దళ్‌ఖాల్సాకు సభ్యత్వం లేదు. చందాలు వసూలు చేయటంలేదు. అయితే ఎప్పుడూ కూడ వారికి డబ్బు కొరతలేదు. ప్రారంభము నుంచీ ఈ సంస్థ తీవ్రవాదాన్నే అనుసరించింది. ఆనాడు అధికారంలో ఉన్న అకాలీదళ్ - జనతా ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెట్టటానికై రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వం దళ్‌ఖాల్సాకు ఆర్థికంగా సహాయాన్ని అందజేసింది.

ఖలిస్థాన్ ఆందోళన ప్రారంభం కాగానే దానిలో మొదట చేరింది దళ్‌ఖాల్సా వారే. 1982 మార్చి నెలలో ఆనంద్‌పూర్ సాహెబ్‌వద్ద ఖలిస్థాన్ జెండాను ఎగురవేసి, ఖలిస్థాన్ పటాన్ని పంచిపెట్టింది కూడ దళ్‌ఖాల్సావారే. అంతకు ముందు 1981లో చౌక్‌మెహతా వద్ద భింద్రన్‌వాలాను పోలీసులు అరెస్టు చేయకుండా కాపలా కాసింది వీరే.

1981లోనే పంజాబ్ రాష్ట్రంలో హత్యలకు, దారిదోపిళ్ళకు, కారకులు దళ్‌ఖాల్సా సభ్యులే. హిమాచలప్రదేశ్, జమ్మూకాశ్మీర్, రాజస్థాన్ ప్రాంతాలలోని గురుద్వారాలలో తీవ్రవాదులను శిక్షణ శిబిరాలను కూడ వీరు నిర్వహించారు.

దళ్ ఖాల్సాను నిషేధించమని కేంద్ర ప్రభుత్వాన్ని దర్బారాసింగ్ తరచు కోరుతున్నా ఆయన ప్రత్యర్థి ఆనాటి కేంద్ర దేశీయాంగ మంత్రి జ్ఞాని జెయిల్‌సింగ్ నిషేధాన్ని వ్యతిరేకిస్తూ వచ్చారు.

హర్సిమ్రాన్‌సింగ్‌ను అరెస్టు చేసిన తరువాత ఆయన దళ్‌ఖాల్సాకు సహాయం చేసేవారి పేర్లు చెప్పటం జరిగింది. జేయిల్‌సింగ్, బూటాసింగ్, జె యస్. తల్వాండిల పేర్లు ఆయన చెప్పిన పట్టికలో ఉన్నాయి.

మొత్తం మీద 1982 మే ఒకటిన దళ్ ఖాల్సాను నిషేధించారు. అయితే ఈ విషయాన్ని పసిగట్టిన దళ్ ఖాల్సా సభ్యులు ముఖ్యంగా బందిపోటు దొంగలు, హంతకులు, విదేశీ ఏజెంట్లు ముందుగానే బబ్బర్ ఖాల్సాలో, అఖిల భారత సిక్కు విద్యార్థి సమాఖ్యలో చేరారు.

చరిత్రలో మరొక దళ్ ఖాల్సా కూడ ఉంది. దానిని 18వ శతాబ్దం మొదట్లో నవాబ్ కపూర్‌సింగ్ ప్రారంభించారు, అకాల్‌తఖ్త్‌కు జాతే

దార్‌గా ఉండే వారాయన, సిక్కులలో ఐకమత్యాన్ని సాధించి, మొగల్ రాజుల దౌష్ట్యాన్ని ఎదుర్కోటానికి చేసిన కృషి అది. ఈ దళ్ ఖాల్సాయే మహారాజా రంజిత్‌సింగ్ సైన్యం యొక్క ప్రధాన భాగం.

అఖండ కీర్తనీజాత

ఈ సంస్థయొక్క మొదటి లక్ష్యం గురుగ్రంథ సాహెబ్ నుండి పాటలు పాడటం, భజనలు చేయటం, కీర్తనలు పాడటం. బీబీ అమర్‌జిత్ కౌర్ పాఠశాల ఉపాధ్యాయిని. ఆ ప్రధానోపాధ్యాయురాలుగా కూడ పనిచేసింది. పాటలు బాగా పాడేది. ముఖ్యంగా భక్తిపాటలు ఆమె పాడుతుంటే వినటానికి శ్రోతలు ఉవ్విళ్ళూరేవారు. ఆమె భర్త ఫౌజ్‌సింగ్ పంజాబ్ ప్రభుత్వ వ్యవసాయ శాఖలో ఇనస్పెక్టర్. ఆయనకూడ భార్యతోపాటు మత సమావేశాల్లో పాల్గొనేవాడు,

1978 ఏప్రెల్ 31 న జరిగిన నిరంకారీ అకాలీదళ్ సంఘర్షణలో ఫౌజ్‌సింగ్ మరణించాడు. బీబీ అమర్‌జిత్ కౌర్ భర్త మరణానికి కారకులైనవారిపై పగతీర్చుకోవాలనుకుంది అంటే నిరంకారీలపై పగతీర్చుకోవాలి.

భారత వైమానికాదళంలో పనిచేసిన ఇద్దరు అధికారులు ఈ బృందానికి మూలపురుషులు. జస్వంత్‌సింగ్ ఠేకేదార్ కూడ సహాయం చేసాడు. ఈ హంతకుల బృందంలో మొదట్లో నలుగురే ఉండేవారు. వారిలో ముఖ్యుడు తల్విందర్ సింగ్. ఫరీద్‌కోట జిల్లా పోలీస్ సూపరింటెంట్. వీరందరికీ తుపాకీ లైసెన్సులు ఇప్పించాడు. వీటి లైసెన్సులు ఇంకొకరి పేరుతో ఉండేవి. ఈ బృందంలో రానురాను పోలీసు కానిస్టేబుళ్ళు, పదవీ విరమణచేసిన సైనికులు చేరారు.

1980 ఏప్రిలు 24 న నిరంకారీ బాబా గుర్బచన్ సింగ్‌ను కాల్చి చంపారు. దానితో ఈ బృందం లక్ష్యం నెరవేరినా, బృందం మాత్రం హంతకుల ముఠాగా ఉంటూనే వచ్చింది. భింద్రన్‌వాలా మనుష్యులు ఎక్కువమంది ఇందులో చేరారు. తల్విందర్‌సింగ్ ఖలిస్థాన్ కోరికకు తన మద్దతును ప్రకటించాడు. బీబీ అమర్‌జిత్ కౌర్ రంజిత్‌సింగ్‌ను బబ్బర్

ఖాల్సా అధిపతి చేద్దామనుకుంది బబ్బర్ ఖాల్సాను కూడ 1978 లోనే ప్రారంభించారు. అయితే రానురాను బృందంలోని వారిమధ్య గొడవలు ప్రారంభమయ్యాయి. బీబీ అమర్‌జిత్ కౌర్‌కు, భింద్రన్‌వాలాకు మధ్య గడ్డివేస్తే భగ్గుమనే స్థితి తయారయింది.

ఖలిస్థాన్ జాతీయ మండలి

డాక్టర్ జగజిత్‌సింగ్ చౌహాన్ వయస్సు 70 సంవత్సరాలు. కమ్యూనిస్టు పార్టీకి చెందిన స్టూడెంట్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా ద్వారా రాజకీయాల్లోకి ప్రవేశించాడు. యల్. యస్. గిల్ పంజాబ్ ముఖ్యమంత్రిగా ఉన్న సమయంలో, ఆర్థికమంత్రిగా పనిచేసాడు. ఆ తరువాత ఇంగ్లాండు వెళ్ళి వైద్యవృత్తిని కొనసాగిస్తూ వచ్చాడు ఖలిస్థాన్‌పేరుతో అతనుచేసే పత్రికా ప్రకటనలను ఎవరూ పట్టించుకొనే వారుకాదు. 19·7లో అకాలీ-జనతా ప్రభుత్వం ఏర్పడిన తరువాత చౌహాన్ తిరిగి భారతదేశానికి వచ్చి ప్రకాశ్‌సింగ్ బాదల్‌ని కలిసి పదవికోసం ప్రయత్నించాడు. అకాలీదళ్ అతనిని లక్ష్యపెట్టలేదు. అయితే అధికారాన్ని కోల్పోయిన పంజాబ్ కాంగ్రెస్ పక్షం అతనిని ఉపయోగించు కోటానికి ప్రయత్నాలు కొనసాగించింది. ఈ సమయంలోనే సంజయ్‌గాంధీ జెయిల్‌సింగ్ దళ్ ఖాల్సాను ప్రారంభింప జేయటానికి ఆలోచిస్తున్నారు. అకాలీదళ్‌కు తలనొప్పి ఎలా సృష్టించాలా అన్నది వారి ఆలోచన. చౌహాన్ అందుకు పనికివస్తాడనే ఆలోచనతో జెయిల్‌సింగ్ అతనిని చాలాసార్లు కలుసుకోవటం జరిగింది. శ్రీమతి గాంధీని కూడ చౌహాన్ కలుసుకున్నాడు. 1980లో తిరిగి అధికారంలోకి వచ్చిన తరువాత చౌహాన్ వలన ప్రయోజనం లేదని కాంగ్రెస్ గ్రహించింది. అయితే అధికార వ్యామోహంతో బాధపడ్తున్న చౌహాన్ ఢిల్లీ జుమ్మామసీదు షాహి ఇమామ్‌ను కలిసి అతనిని సహాయాన్నికోరి, ఆ తరువాత ఖలిస్థాన్ కావాలంటూ ప్రకటించాడు. 1980 మార్చిలో అతను తిరిగి ఇంగ్లాండు వెళ్ళిపోయిన తరువాత జూన్ 1980లో బల్బీర్‌సింగ్ సంధూ ఖలిస్థాన్ స్థాపనను ప్రకటిస్తూ, ఖలిస్థాన్ జాతీయ మండలికి అధ్యక్షుడిగా చౌహాన్‌ను, ప్రధాన కార్యదర్శిగా తన పేరును ప్రకటించాడు.

చౌహాన్ పాకిస్థాన్‌ను చాలాసార్లు సందర్శించాడు. భారతదేశానికి తన బంధువుల ద్వారా చాలా డబ్బునే పంపించాడు. సిక్కు సంస్థలు కూడా చౌహాన్‌కు బాగానే డబ్బును అందజేసాయి. చౌహాన్‌కు అమెరికాలో సెనెటర్ డానియల్ గ్రాహమ్‌తో, సెనెటర్ మార్క్ హాట్‌ఫీల్డ్‌తో, సెనెటర్ జెస్సీ హెల్మ్స్‌తో, సెనెటర్ సామ్‌నన్‌తో సంబంధాలున్నాయి.

ప్రకాశ్‌సింగ్ బాదల్, సంత్ లాంగోవాల్ మొదలైనవారికి చౌహాన్ అంటే పడదు. వారెప్పుడూ ఖలిస్థాన్ కోరికను సమర్థించలేదు. కానీ తో హ్రా, తల్వాండి, అకాలీతఖ్త్ ప్రధాన పూజారి గుర్‌చరణ్‌సింగ్ అజ్నోహా మాత్రం చౌహాన్‌పట్ల సానుభూతిని ప్రదర్శిస్తూ వచ్చారు.

గంగాసింగ్ ఢిల్లాన్ అమెరికా పౌరసత్వాన్ని స్వీకరించిన వ్యాపారస్తుడు. వాషింగ్టన్‌లోని నంకానా సాహెబ్ ఫౌండేషన్ అధ్యక్షుడు. అమెరికా దేశపు రక్షణ శాఖ గూఢచారి విభాగంతో సంబంధాలున్న వ్యక్తి. పాకిస్థాన్‌లోని గురుద్వారాలను సందర్శించే మిషతో తరచుగా ఆ దేశానికి వెళ్తూ అచ్చటి అధికారులను కలుస్తూ వచ్చాడు. అకాలీదళ్, కాంగ్రెస్ పార్టీ రాజకీయాలు పంజాబ్‌ను కలుషితం చేసేవరకు, ఢిల్లాన్, చౌహాన్‌లకు విలువలేదు. వారి పేర్లు కూడ చాలమందికి తెలియవు.

ఖలిస్థాన్ జాతీయ మండలిని, దళ్‌ఖాల్సాతో పాటు [illegible] లో నిషేధించారు.

**అఖిల భారత సిక్కు విద్యార్థి సమాఖ్య**

కమ్యూనిస్టు పార్టీల ప్రభావం, ముఖ్యంగా మార్క్సిస్టు పార్టీ ప్రభావం రైతాంగంలో పెరుగుతోందని భయపడ్డ అతివాదులు — మరో పరి భాషలో చెప్పాలంటే నక్సలైట్లు అఖిలభారత సిక్కు విద్యార్థి సమాఖ్యలో చేరి దానిని తమ స్వంతం చేసుకున్నారు. కమ్యూనిస్టు పార్టీలు ... మాటలు ఉ దేకాన్ని కలిగిస్తూ, యువకులను ఆకర్షిస్తున్నారనే ... అకాలీదళ్ వీరిని సమర్థించడం ప్రారంభించింది. ... సంత్ కర్తార్‌సింగ్ కుమారుడు భాయి అమ్రిక్‌సింగ్ ఈ సంస్థలో చేరి ... అధ్యక్షుడైయ్యాడు. మోగా, ఫరీద్‌కోట, పాటియాలాల్లో విద్యార్థులను

ఆకర్షించగలిగాడు. డమ్‌డమాసాహెబ్ - సంత్‌కర్తార్‌సింగ్ తరువాత అధిపతి అయిన జార్నైయిల్‌సింగ్ భింద్రన్‌వాల, తన గురువుగారి కుమారుని తన ధార్మిక సోదరునిగా భావించి, తన ముఖ్య సలహాదారుగా స్వీకరించాడు. 1980 తరువాత ఈ సంస్థ భింద్రన్‌వాలా జేబు సంస్థగా మారింది. ఇందులో కిరాయి హంతకులు, గూండాలు చేరారు. దళ్ ఖాల్సాతో, బబ్బర్‌ఖాల్సాతో సంబంధాలు పెట్టుకొని, తీవ్రవాదులకు మన దేశంలో విదేశాలలో శిక్షణ శిబిరాలను నిర్వహించింది.

ఈ తీవ్రవాద సంస్థలన్నింటికీ విదేశాలలో శాఖలున్నాయి అమెరికా ఇంగ్లాండు, కెనడా, జర్మనీ, ఫ్రాన్స్ పాకిస్థాన్ దేశాలతో వీరికి సంబంధాలున్నాయి. భారత దేశంలో వీరికి ఒకరితో మరొకరికి పడకపోయినా, విదేశాల శాఖలలో మంచి సమన్వయముంది. ఆ సమన్వయకర్త గోర్డన్ లారెన్స్. అతడు బ్రిటిష్ సైకలాజికల్ ఏజెన్సీకి చెందినవాడు. ఆ ఏజన్సీ, సి. ఐ. ఏ ప్రారంభించిందే - అతనికి కేంద్రం. లండన్.

1981 వరకు ఈ సంస్థలు ఒక పద్ధతి అంటూ లేకుండా కార్యకలాపాలను కొనసాగించినా, ఆ తరువాత సమస్యను జటిలం చేయటంలో తమ పాత్రను యోజనా బద్ధంగానే నిర్వహించాయి, రాజకీయ పక్షాల తాత్కాలిక ప్రయోజనాల కోసం, నాయకులు పదవుల కోసం, ప్రభుత్వ యంత్రాంగం ముఖ్యంగా పోలీసు ధనం కోసం పనిచేయటం తీవ్రవాదులకు లాభించాయి.

తీవ్రవాదులనందరినీ నాలుగు రకాలుగా మనం విభజించవచ్చు. మత మౌఢ్యులు, విదేశీ ఏజంట్లు, నక్సలైట్లు, దొంగలు ఆ నాలుగు రకాలవారు. అందులో విదేశీ ఏజంట్లు, నక్సలైట్లు పోలీసులకు దొరకుండా తప్పించుకు తిరగగలరు. మత మౌఢ్యులు హత్యలకు పాల్పడి దొంగలు తీవ్రవాదుల పేరిట లూటీలు చేస్తున్నారు.



# వి డు ద ల యి ం ది

1947 నుండి నేటివరకు మన దేశాన్ని పట్టి పీడిస్తున్న సమస్యలలో అతి ముఖ్యమైనది కాశ్మీర్ సమస్య. ప్రజాభిప్రాయాన్ని మన్నించకుండా కేంద్ర ప్రభుత్వం ఈ సమస్యను ఒక విధంగా పెంచుతూ వచ్చింది. నేడు కాశ్మీర్‌లోయ దేశవిద్రోహులకు, విచ్ఛిన్నకరశక్తులకు నిలయంగా తయారయింది. విదేశీ ఏజెంట్లు, పాక్ గూఢచారులు మనను దెబ్బ కొట్టటానికి కాచుకుకూర్చున్నారు. తమ జీవితాలనే త్యాగం చేసినవారూ ఉన్నారు. ఈ సమస్య పూర్తి వివరాలకై చదవండి.

## ఆ కు ప చ్చ మం టల్లో
## అందాల కాశ్మీర్

## స్వార్థ రాజకీయాల ఊబిలో
## పంజాబ్

పంజాబ్ సమస్య నేడు భారతదేశ హృదయంలో ఆరని మంటగా తయారయింది. భారతదేశసమగ్రతకూ, సమైక్యతకూ ప్రమాదంగా పరిణమించింది. భారత దేశరక్షణకు పెట్టనికోటగా ఉంటున్న పంజాబ్ నేడు శత్రుదేశమైన పాకిస్తాన్ విచ్ఛిన్నకర శక్తులకు నిలయమైంది. మాతృభూమి రక్షణకు, హిందూ ధర్మానికి అంకితమై ప్రాణాలర్పించిన ఆ శిక్కుపరంపరనుండే నేడు భారతదేశాన్ని విచ్ఛిన్నం చేసే విద్రోహకరశక్తులు ఉద్భవించడం, స్వైరవిహారం చేస్తున్న విచ్ఛిన్నకరశక్తులకు ప్రేరణ కావడం విచిత్రమైన విషయం.

పంజాబ్‌లో నేడు దేశవిచ్ఛిన్నకరశక్తులైన ఖలిస్తాన్ వాదులు జరుపుతున్న మారణహోమం. ఒకేకుటుంబసభ్యులుగా జీవిస్తున్న శిక్కు, శిక్కేతర హిందువుల మధ్య చిచ్చు రగిల్చినట్లయింది. హిందువులకు తమ సహోదరులవల్లనే రక్షణలేని స్థితి ఏర్పడింది. నేడు ప్రాణరక్షణకు తమ జన్మభూమియైన పంజాబ్ నుండి శరణార్థులుగా తరలిపోవలసిన విచిత్రమైనస్థితి ఏర్పడింది.

దేశభక్తికి ప్రతీకయైన పంజాబ్‌లో ఇట్టి స్థితి పెంపొందటానికి కారణం ఏమిటి? ఈనాటిస్వార్థప్రయోజనాలకు అంకితమైన కాంగ్రెస్, ఆ కాంగ్రెస్‌నేతలైన నెహ్రూ కుటుంబం ఎంతవరకు దీనికి బాధ్యులు? నేటి స్వార్థరాజకీయశక్తులు ఈ సమస్యను మరింత జటిలం చేస్తున్నాయి. ఇది బాధ్యత కల ప్రతి భారతదేశపౌరుడు అధ్యయనం చేయవలసిన విషయం. ఈ చిన్న పుస్తకం అందరికీ ఉపయోగం కాగలదు.